# నిర్మలానంద సూక్తులు

పరలోకవాసుల సహకారముతో

ఆటోరైటింగు విధానమున

స్వర్గాశ్రమవాసి

నిర్మలానందస్వామి కూర్చిన

**సూక్తులు 412 మాత్రమే**

రచన - ప్రచురణకర్త.

నిర్మలానందస్వామి

స్వర్గాశ్రమము - రామానుజపురం

[illegible]/164 చిలకలపూడి - కృష్ణాజిల్లా - ఆంధ్రప్రదేశ్

అక్టోబరు 1970

వెల : రు. 2-00

పోస్టేజి అదనం

# నిర్మలానందసూక్తులు



1. రాముడు సీతాదేవిని పెండ్లి చేసికుని, ఆనందంకంటె కష్టములనే అనుభవించినాడు. అది ఆమె దోషముకాదు. అది అంతయు దైవ నిర్ణయము.

2. పురుషుడు గ్రామాంతరము వెళ్ళినప్పుడు తనతల్లిని భార్యాబిడ్డలను, ఇంటివద్ద విడచి వెళ్ళుచున్నాడు. తిర్గి వచ్చేవరకూ వారికి తోడునీడగా ఆదైవమే కాపాడుచుండును.

3. దుర్మార్గులు మార్గ మధ్యమున ముండ్ల కంపలు వేయుదురు. సన్మార్గులు వాటిని తీసి బాటసారులకు చక్కని బాట చేయుదురు.

4. నవమినాడు చంద్రుడు సుమారుపాతికభాగంకనబడును కాని పౌర్ణమినాడు పూర్ణప్రతిబింబము చక్కగా గోచరించును. అంటె శిశువు ఎదిగినకొలది జ్ఞానవంతుడైనట్లుగా చంద్రబింబము పెద్దదైనకొలది వెన్నెల మిక్కుటముగాలభించును.

5. ఆకాశముపైన వేలకొలది నక్షత్రములు గన్పడు చున్నవి కాని అందులో అరుంధతీనక్షత్రమును వివాహకాలమున నూతన వధూవరులకు దర్శనము చేయించెదరు. అంటే ఆ అరుంధతి గొప్ప పతివ్రత, జీవితకాలములో ఆచరించిన ధర్మప్రవర్తననుబట్టి ఆమె ఒక నక్షత్రముగా ఉద్భవించినదని,

అదే ప్రకారము ఈ నూతనవత్సరావసరులు జీవితమును గడిపి ప్రవర్తించమని ఆదర్శరూపముగా చూపబడుచున్నది. ఋషులనే సర్వమతస్థులు వారి వారి మతములలోని ఆదర్శపురుషుల చరిత్రలను బోధించుచుండెదరు.

6. నేడు అమావాస్య అంటే చంద్రుడు మనకు గోచరించడు కాని ఆకాశములోనే యున్నాడు. విదియనాడు మన పునర్దర్శనమిస్తాడు ఆలాగే ప్రతిజీవి కొంతకాలము జీవయాత్ర చేసి మరణించి తిరిగి ఇంకొక శరీరముతో ప్రత్యక్షమగుచున్నది. అది గ్రహించలేనివారు నాబంధువులు చనిపోయినారని విచారపడుచున్నారు. ఇది వెర్రితనము అజ్ఞానము. ఆ పరమాత్మ ఇదేవిధముగా సమస్తప్రాణులకు పునర్జన్మ కలిగించుచున్నాడు కాని ముగింపులేదు. అట్టిముగింపు కోరువారు ధర్మప్రవర్తకులై పరోపకారచింత కలిగి సర్వ జీవరాసులయందు ఆదరణ, భక్తి ప్రేమలతో ప్రవర్తించినయెడల ఆజీవి పునర్జన్మరహితులై ముక్తిని బడయుచున్నారు.

7. నా వయస్సులోఉన్న ఆరోగ్యం వృద్ధాప్యములో వుండదు. అటులనే ఆలోచనలుకూడా తగ్గుచుండును. ఇందుకు ఉదాహరణ ఒక ఫలవృక్షము చూడండి ఋతుకాలములో పండ్లు కలుగచేయును. అన్యకాలములో ఆకులు మాత్రమే యుండును.

8. నావలో ప్రయాణము చేయువారు నావికుని బుద్ధిజ్ఞాన సహాయముతో గమ్యస్థానము చేరుచున్నారు. మానవుడు దైవసహాయముతో పరలోకమును చేరుచున్నాడు. శ్రీమంతులు

గర్భమునిండా భుజిస్తారు అజీర్తి వ్యాధితో బాధ పడతారు- పేదవారు కొద్దిగా భుజించి ఆకలిబాధ తీర్చుకొంటారు- ఆరోగ్యంగా వుంటారు.



9 చితుకులతో వంట చేసుకొనినను లేక కట్టెలతో వంట చేసుకొన్నను అన్నం ఉడుకుతుంది.

10 పరోపకారబుద్ధిలేనివారు ఎంతసేపు తమ కీర్తి, ప్రతిష్ఠలు, ఆకలిబాధలే తీర్చుకుంటారు. ధనం మూటకట్టి ఎవరికో నప్పగించి చనిపోతారు. మరి జ్ఞానులు ప్రాప్తించిన దానిలో పరోపకారముచేసి శేషించినదానిని అనుభవిస్తారు.

11. పుష్పాలు చెట్లకు ఉండినప్పుడు చాలా శోభస్కరముగా యుండును. ఆ పుష్పాలో చెట్లనుండి విడిపరచినప్పుడు చెట్లయొక్క అలంకారమునకు భంగము వాటిల్లును. అటులనే మానవుడు తన కుటుంబసభ్యులతో వర్ధిల్లుచున్నప్పుడు ఆనందముగా యుండును కాని కాలవశాత్తు అట్టి కుటుంబములో పొరపులు సంభవించినప్పుడు ఆనందము సన్నబడులు ద్వేష అసూయాభావములు మెండై కుటుంబ గౌరవమునకే హాని తటస్థించును.

12. జాతకచక్రముచూచి మా అబ్బాయి దీర్ఘకాలము జీవిస్తాడు, సంతానవంతుడు, ఐశ్వర్యవంతుడని ఆనందిస్తారు. ఆ అబ్బాయికి ఏబాధ కలుగకుండా సహకరిస్తారు. జాతక చక్రములో ఇతడు దరిద్రుడు అని తెలిస్తే ఆనాటినుండి బంధుకోటి హీనముగాచూస్తారు. ఇది ప్రపంచధర్మం.

13. నేడో రేపో గ్రామాంతరం వెళ్ళవలెనంటే పెట్టి, బట్టలు సర్దుకుంటారు. కాని నేడో రేపో చావనున్నానని తెలియక ప్రతివస్తువు నాదిఅని జాగ్రత్తపరుచుకుంటారు.

14. రాత్రి పరుండినప్పుడు దొంగలువచ్చి నీ ఆస్తి అపహరిస్తారని జాగ్రత చేస్తావు కాని మరణకాల మాసన్నమైనప్పుడు దాచినవన్నీ వదలి నీవే పోవుచున్నావు.

15. ఆయువు ఉన్నంతవరకే నాది, నేను అని పోట్లాడుతావు కాని ఆయువు పోయినప్పుడు నీబంధువులే నిన్ను తీసుకు వెళ్ళి దహనము చేయుచున్నారు

16. ఒక పక్షి గూడుపెట్టినదంటే, ఆగూడును గాదిగి పెద్ద చేసి పిమ్మట చితుకగొట్టి పిల్లలు చేయును ఆపిల్లలే పెద్దవై రెక్కలుకలిగి వాటి ఆహారమును అవి సంపాదించుకుని జీవించును. అటులనే మానవుడుకూడా చిన్నతనములో తల్లి తండ్రుల పోషణవల్ల పెరిగి పెద్దలై ఆర్జితపరు లగుచున్నారు. పక్షివలె పెంచి పెద్దను చేసిన వారి వృద్ధాప్యములో వారిసేవ మరచుచున్నారు. ఇది ధర్మంకాదు.

17. చీమలు బారులుతీసి పోవుచుండగా బాలురు చూచి ఆనందిస్తారు. సైనికులు బారులు బారులుగా వెళ్ళి పరరాజులపై దండెత్తి వారి రాజ్యమును కొల్లగొట్టివస్తారు.

18. నల్లేరుకాడలు తెచ్చి రసంతీసి ఆరసంలో నిమ్మ ఉప్పుకలిపి మజ్జిగ తేటతో గుక్కెడుత్రాగితే కడుపులో వున్న దోషములు యావత్తూ నశిస్తవంటాయి.

19. పసుపులసై పసుంటారు, పగలు ఆరవేయరు. అంకువల్ల పండినప్పుడు కలిగిన చమటఇమికి పసుపుకు నలు మూలలా నల్లులు పుట్టుచుండును.

20. తేనెటీగలు కష్టపడి పుట్టలుపెట్టి ఎక్కడెక్కడ నుండో పుష్పములలోని తీపిపదార్థమును పొంది తెచ్చి పుట్టలో నిల్వ చేసుకొంటే ఆ పుట్టలుకొట్టి ఈగలను తరిమి ఆ తేనెను అపహరిస్తారు. కాని తమ జేబులో కానిడబ్బు ఎవరైనా అపహరిస్తే పోట్లాడుతారు.

21. అరటిపండు తెచ్చి ఒలిచి మజ్జిగలో పిసికి తింటే ఆరోగ్యముగాయుండును. అదే చక్రకేళీపండుఅయితే అజీర్తి చేయును.

22. మామిడిఆకులు తోరణములు కటతారు. ఆ ఇంట్లో ఏదో ఒక శుభకార్యము చేస్తున్నారని సూచన. అదే వేపాకు కడితే ఆ ఇంట్లో ఎవరో మశూచికముతో బాధపడుచున్నారని హెచ్చరిక,

23. పాలు పొంగి పొయిలో పడితే ఆ యింటివారికి సకల ఐశ్వర్యములు కలుగునని సూచన.

24. గున్నపోతును తెచ్చి ఎంత శుభ్రపరచినా అది తిరిగి మురుగుగుంటలలో దొర్లుతు. పసిపాపలను స్నానం చేయించి కొత్తబట్టలు కట్టి ఉయ్యాలలో పడుకోపెట్టినా ఉచ్చపోసి, విరేచనము చేసుకొని ఒళ్ళుఅంతా అలుక్కుంటారు- ఇదిస్వభావము.

25. చామదుంపలు తెచ్చి తరిగి కూరవండుతారు. కాని దాని స్వభావము పోదు. కొన్ని ఉడుకుతవి మరికొన్ని ఉడకవు. అందుకనే దుంపకూరలు నిషేధంఅంటారు.

26. పురిటిలోవున్న శిశువును మరిఎవరూ ముట్టరు, పురిటిస్నానంచేయించి చాటలో పరుండబెట్టినతర్వాత అందరు ఎత్తుకుని ముద్దాడుతారు.

27. ఆముదము చంటిపిల్లలు ఒంటినిండా వ్రాస్తే చర్మము మృదువుగాను, కాంతివంతముగాను వుండునని తలచే వారు కాని నేటికాలములో వాటిని మరచి స్నో వ్రాస్తారు. ఇది నేటి నాగరికత.

28. తులసిచెట్టు దొడ్లో నాటి ప్రతిరోజు అక్కడ పూజలు, దీపారాధనలు చేస్తారు. తులసి అంటే హిందూ స్త్రీలకు భక్తి మెండు.

29. చలువరాతి విగ్రహములు తెచ్చి దైవమనిఆరాధిస్తారు- అది ఒక విశ్వాసం- ప్రతి విగ్రహము రాయిగాని, లోహముగాని, కర్రగాని మనస్సు నిలకడకోసం నిర్ణయించు కున్న గుర్తులే.

30. చమటలుపోసి కష్టపడి ఆర్జించి భర్త ఇంటికి వెచ్చములు తెస్తే భర్త కష్టం గుర్తించక, పప్పు మంచిది కాదు, బెడ్డలు ఉన్నవంటే భర్తమనస్సు చిటుక్కుమంటుంది: తెచ్చినవవస్తువులు స్వీకరించి ఆనందంగా వంటచేసి భోజనము పెడితే ఉత్సాహపడతాడు.

31. నారాయణ నామస్మరణ చేసుకుంటూ బిచ్చ మెత్తుకుంటూ వచ్చేది బిచ్చగాడు కాదు- ఆ దైవమే నీకు దైవభక్తి లభింపుటకుగాను నీ గడపకు వస్తే భక్తితో ఆదరించు,

32 చిరంజీవ అని దీవిస్తారు- అందరు చిరంజీవులైతే ప్రాపంచక నడకకు భంగం కలుగుతుందిగదా!

33 ప్రతికుటుంబములోను భార్యాభర్తలుగాక పిల్లలు వృద్ధులు ఉంటారు వారి యోగక్షేమము లన్నియు యీ దింపడు లే కూడా కలసి యుంటుంది- కాని కొందరు తమ వల్లనే ఇతరులు పోషింపబడుచున్నారని ఈసడింపుగా చూస్తారు అది ధర్మంకాదు- మరి కొంతకాలమునకు వీరే ఆ వృద్ధులవుతే వారిబాధ తెలుస్తుంది- గనుక ప్రతికుటుంబీకుడు తన యింటి లోని వారందరు ఒక వృక్షముయొక్క కొమ్మలు రెమ్మలుగా భావించి కలిగినది గౌరవభావముతో యింటి సభ్యులందరు అనుభవింపుట ధర్మం- ఆ ధర్మమును పాటించనివారు వారి వృద్ధాప్యములో ఇక్కట్లు బాధపడవచ్చును.

34. తద్దినాలు పెడతారు కాని ఆ చనిపోయినవారు ఎవరో కూడా వారికి తెలియదు- చనిపోయినప్పుడు కర్తవ్యం చిన్నపిల్లలచేత పెడతారు- వారు పెద్దలయినప్పుడు వారికి తెలియని బంధువులకోసం తద్దినాలు పెట్టడానికి విసుక్కుంటారు,

35. చలికాలములో దుప్పట్లు కప్పుకుని పరుంటారు. సూర్యరస్మి తగిలినప్పుడు నిదుర లేస్తారు. వేసవికాలములో

తెల్లవారుజామునే లేస్తారు కాని కబుర్లు చెప్పుకొంటూ కాల క్షేపము చేస్తారు.

36. అన్నం భుజించేటప్పుడు బంధువులువస్తే భోజన మయినపిమ్మట వారితో మాట్లాడుతారు. అది ధర్మంకాదు. భోజనసమయమున వచ్చిన అతిథికి తన సరసనే కూర్చుండ పెట్టుకుని వారికిభోజనం యేర్పాటుచేసి పిమ్మట తానుభుజిస్తే దైవము ఆనందిస్తాడు.

37. చింతచిగురు పప్పు వండుకొని భుజిస్తారు. అది రుచిగానే వుంటుంది కాని కడుపులో చింతలు పెరుగును.

38. జిలేబీమిఠాయి వేడివేడిది తింటే బంకవిరేచన ములు పోతవి.

39. దోసగింజలు వేయించి దంచి పొడుంచేసి, భోజన ములో తింటే కడుపులోని అజీర్తిదోషం హరిస్తుంది.

40. పసుపు ముఖమునకు వ్రాసుకుంటారు స్త్రీలు పూర్వకాలం. నేటిస్త్రీలు స్నో వ్రాసుకుంటున్నారు. దేని ప్రయోజనం దానికే.

41. అన్నం వండి దించి ప్రక్కన ఉంచుతే చల్లారి పోతుంది. రుచిఉండదు. వంట అయినపిమ్మట పొయ్యి ఆర్పి పొయ్యిమీద ఉంచుతే పొయ్యివేడికి చల్లారక మృదువుగా యుంటుంది. ఇదియనుగాక అన్నం తప్పాళాలోకంటె కుండలో వండుతే రుచిగావుంటుంది.

42. రాత్రిపూట పరుండేటప్పుడు దైవ నామస్మరణ

చేసుకుని పరుండే పిల్లవాండ్రయూస బడలిక సమసిపోయి మిమారనుంచి లేగుస్తారు.

43. ప్రపంచములోని సర్వ వృత్తుల నాచరించుటకు కొన్ని పరికరములు అవసరమైనవి. అట్టవాటిలో కొన్ని ఉదహరింపబడుచున్నవి.

వ్యవసాయదారుని పరికరములు : ఎద్దు, నాగలి
కూలివాని పరికరములు . పలుగు, పార
దాసీల పరికరములు . చీపిరి, పలిక
వర్తకుని పరికరములు : త్రాసు. తక్కెడ
విద్యావంతుని పరికరములు: విశ్వవిద్యాలయపరీక్షాపత్రములు
ధర్మాత్ముని పరికరణములు · జాలి, కరుణ, దయ, త్యాగము
యాచకుని పరికరణములు : భిక్షాపాత్రి
సంగీతవిద్వాంసుని పరికరణములు: వాయిద్యములు, గాత్రము
జ్యోతిష్యుని పరికరములు గగనశాస్త్రము, పంచాంగములు
పండితుని పరికరములు బిరుదులు, కంకణ, కందనములు,
శిల్పిగొనుక్క- పరికరములు : పోగరు, సుత్తి
కళాకారుని పరికరములు · కుంచి, రంగులు
కంసాలి పరికరములు శ్రావణం
కుమ్మరి పరికరములు · సాన, జిగురుమట్టి ఇత్యాదివి గలవు

44. పురుషులు వేసకువేలు యుద్ధరంగమున హతులగుచున్నారు. దీనికి మూలకారణము ప్రజలలోను, ప్రభు

వులలోను దురాశ, దురాక్రమణతో పరశ్రేయోభిలాష నశించుటయే దీనికి విముక్తిమార్గము, ప్రేమ, కరుణ, జాలి సర్వ జీవరాసుల క్షేమము తమదిగా భావించిననాడు మానవు లభించును.

45 చిరతనాడు అలవడిన దురభ్యాసములు జీవిత పర్యంతం విడనాడవు గనుక బాల్యమునుండి సద్భావములు అలవరచుట ముఖ్యము

46. దేశాభిమానముతో ఎన్నో కష్టములకు నోర్చి, పర ప్రభుత్వములను పారద్రోలినంత మాత్రమున దేశము సుభిక్షముగా నుండదు. ప్రజలలో ఐకమత్యము, క్రమ శిక్షణ, ధర్మాచరణ, పరోపకారసేవ, పరిపాలక శాసనముల యందు గౌరవము ఆదరణ ముఖ్యము.

47. విద్యావంతుని కంటె, ధర్మాచరణాపరుడే శ్రేష్ఠుడు.

48. ఎన్ని విద్యల నేర్చినను, పొట్టకూటికే యని భావించువాడు అజ్ఞాని.

49. నీకంటె వృద్ధులు, జ్ఞానవంతులు తటస్థించినప్పుడు గౌరవపూర్వకముగాను, విధేయతా పూర్వకముగాను నమస్కరింపుము.

50. అజ్ఞానులు తటస్థించినప్పుడు వారిని హీనముగా చూడక జాలి, కరుణతో ఆదరించుము.

51. పసిపిల్లలు నీచెంతకు వచ్చినప్పుడు ముద్దాడి పంపు ఇది నీధర్మం.

52. నానాజాతులవారైనకూడా నీ దేశవాసులే యనెడి భావముతో గౌరవించు

53. వర్షము కురిసినప్పుడు నీ గడపకు వచ్చి నిలబడిన బాటసారులను ఆదరణతో ఆహ్వానించుము.

54. ఎండాకాలములో బాటసారుల సౌకర్యార్థము చలివేంద్రిలు పెట్టుము, చలవపందిళ్ళు వేయించు.

55. పగటిపూట నిద్రపోకుము.

56. ఆవు పరుండినను, కూర్చుండినను, నిలుచుండినను గడ్డి నెమరు వేయును. అటులనే గురువువద్దనున్న శిష్యుడు గురువు వెంట తిరుగుచు పాఠముల వల్లెవేయుచుండును.

57 శనిగ్రహము వచ్చినదని కొందరు చింతిస్తారు. శని మహార్దశలో అభివృద్ధి కలిగినవారు పలువురు యున్నారు. అంతే ఇతరగ్రహముల మిళితమువల్ల ప్రాప్తించు దోషములే మనుష్యకారణము,

58. ప్రజలు వేలకువేలు పెరుగుచున్నారు. నశించువారు నశించుచున్నారు. కాని నశించువారి సంఖ్యకంటె ఉత్పత్తిసంఖ్య మిక్కుటమగుటచే ఈ భేదము తటస్థించుచున్నది.

59. పరలోకము పరలోకము అంటారు, ఆ పరలోకములో యున్నవారు ఈలోకము నుండి తాత్కాలికముగా వెళ్ళినవారే. యాత్రికులు యాత్రాస్థలములకు వెళ్ళి తిరిగి వారి స్వస్థానములకు తిరిగివస్తారు. ఆలాగుననే ఈ పరలోకము

నకు వెళ్ళినవారు అచ్చటి కార్యక్రమములు పూర్తికాగానే తిరిగి భూలోకమునకు వచ్చుచున్నారు.

60 శరీరములో జీవు డున్నంతసేపే నా బంధువులు, నావారు, పరాయివారు అనే భేదభావము. ఆజీవుడు వెడలిన నాడు ఈ భావములకు తావులేదు.

61 అష్టైశ్వర్యములతో తులతూగినవారు కూడా మరణించినప్పుడు కాటికి వెళ్ళక తప్పదు.

62 ధూపదీప నైవేద్యములు చేస్తారు. ఆ చేసేది ఎదుటనున్న విగ్రహమునకైనను, ఆ ధూపమువల్ల ప్రాంత మంతటా యున్న దుర్గంధము హరించును. నివేదన చేసిన పదార్థములు దైవప్రసాదమనెడి భావముతో బంధుమిత్రు లకు నొసంగి నీవు అనుభవించుచున్నావు అంటే నీకు కలిగినది నీవే అనుభవింపక పరోపకారబుద్ధితో ప్రవర్తించుట

63. విగ్రహ ఆరాధకులు నివేదనచేసిన ప్రసాదము లను తిరిగి తమరే పొందుట ధర్మముకాదు. ఎందువల్లనంటే ఆ దైవమునకు నీచేతులతో నీవు సమర్పించిన ప్రసాదమును తిరిగి నీవు తస్కరించి తినుటకంటె పరులకే వినియోగపరచుట ఉత్తమము. అందువల్ల ఇతరులను దైవస్వరూపులు గా భావించి సమర్పించుట. నీవు భుజించినప్పుడు ఇతరులకు సమర్పించినదానిని తిరిగి తీసుకుని నీవేఅనుభవించుట దోషము కాదా?

64. యజ్ఞయాగాదిక్రతువులుచేసేవారు ఆడంబరము కొరకు పరలోకములో రంభాసంభోగము నిమిత్తము ప్రతిఫల

ఆపేక్షతో చేస్తారు. అందువల్ల కలిగే ఫలితము క్షణకాలమే.

65. ప్రభువులు వేలాదిమంది రాజ్యపరిపాలనచేసి మరణించినారు కాని వారిలో కొలదిమంది జీవిత చరిత్రలు మాత్రమే ఆదర్శప్రాయమై కలకాలము చెప్పుకుంటారు. అట్టి వారిలో శ్రీరామచంద్రుడు, నలమహారాజు, హరిశ్చంద్రుడు ఇత్యాదులు.

66 రాముని పట్టాభిషేకమహూర్తమునకే వనవాసము ప్రాప్తించినదంటే అది మహూర్తదోషముకాదు. నలుమూలలా దేశములో కలవరపరచుచున్న అధర్మ ప్రవర్తనలు అణచకుండా నీవు సింహాసనము అలంకరించుట అధర్మమని హెచ్చరింపబడినభావమే ముఖ్యకారణము.

67. నారదులవారు త్రిలోకసంచారి అనగా త్రిలోకములలో జరుగుచున్న సర్వ ధర్మ, అధర్మ ప్రవర్తనలను గురించి వారివారికి తోచని భావములను కలుగచేసి వారిలో చైతన్యమును కలుగిచేయు మహానుభావుడు అంతేగాని తంపులుపెట్టి ఆనందించేవాడుకాడు. ఇది గ్రహించలేనివారు తంపులమారి అంటారు.

68. పరమభాగవతుడు కాళిదాసు రచనలు చాలా ప్రశంసనీయములైనవి. అవి సంస్కృతభాషలో వున్నందున వాటి రుచిని సర్వప్రజలు పొంది ఆనందించలేకుండా వున్నారు.

69. శ్రీమంతుల ఇండ్లలో ఉండే సేవకులకు అన్నం, వస్త్రములకు లోటువుండదు కాని వారు సేవకులకు తగు గౌరవము నివ్వరు.

70. నానా జాతి మత కలహములు నశించవలెనంటే భూమిమీద ఉద్భవించిన ప్రతిమానవుడు దైవస్వరూపుడు అనే భావము ప్రజలలో కలిగినప్పుడు సమసిపోగలవు.

71. ఇరుకు ఇరుకు సందులలో నివసించేవారుకూడా ప్రతిరోజు గాలి, వెలుతురు కోరుతారు, కాని వారికి స్వభావికముగా అలవడిపోయినందున వెరువరు.

72. ప్రజాబాహుళ్యము యున్నచోట గడబిడలు, కొట్లాటలు తప్పవు.

73. ప్రతిరోజు రాత్రిపూట పరుండేటప్పుడు ఆగోజునకు ఆహారపానీయములను కలుగచేసిన ఆ దైవమును ప్రార్థించి పరుండు.

74. యావత్ భారతప్రభుత్వమును చేతపట్టినది మహిళయైనను దైవశక్తివల్ల సర్వప్రజలయందు ఆదరభావముతో పరిపాలించుచున్నది. ఆమెకు దైవము ఆయురారోగ్య, ధైర్య బల, జ్ఞాన శక్తులను ప్రసాదించుగాక.

75. యాచకులు పలువురు నీ దాతృత్వమును పొగడుచూ నీ గడపకు వచ్చి అర్థించినప్పుడు వారిని ఆదరించవలెను గాని నిర్లక్ష్యభావముతో వెడలగొట్టకుము.

76. ఆవు చేనులోపడి మేయుచున్నదని, చేనుకు నష్టము కలుగచేయుచున్నదని పడబాది పట్టుకుని గుంజకుకట్టి బాధించుచున్నావు. కాని దాని ఆకలి తీర్చుటకు కొంచెమైనను నీ చేతులతో నీవు ఆహారమును కలుగచేయనప్పుడు

అది స్వతంత్రించి నీ చేతులలో బడుచున్నదని గ్రహించవలెను. అంతేగాని పూర్తిగా ఆవు దోషియని తలంపకుము. నీ బాధ్యత నీవు తీర్చుట తెలిసికొనుము.

77 పలువురు శ్రీమంతులు కలసి ఒక మార్గమున పోవుచుం మార్గముప్రక్కన ఆకలిబాధతో అరచుచున్న రోగులనుచూచి వీరు సోంగవేషధారులు అంటావు. అది ధర్మంకాదు. నీవు యెంత శ్రీమంతుడవయినను ఆకలిబాధ సమమే గనుక వారిబాధ గ్రహించి సహకరించు. అంతేగాని నిర్లక్ష్యభావముతో వెళ్ళకుము.

78. జీవాత్మ పరమాత్మ యని వేరువేరు ఆత్మలు లేవు కాని జీవాత్మ ఏకవచనము, పరమాత్మ బహువచనము.

79. నేడే నారాయణ స్వరూపముగా భావించు చున్నావు అంతేకాదు. నీపాదములకడ నివసించు కుక్క, పిల్లి కూడా ఆ నారాయణ స్వరూపములుగా భావించి ఆదరించు.

80. పురుషోత్తముడు అంటే పురుషులలో శ్రేష్ఠుడుఅని భావించి ఆయనను గౌరవించి ఆదరించు, ఇది మానవధర్మం.

81. నిండు చూలాలు గృహకృత్యములను చేసు కొనుచూ బిడ్డలపోషణ, భర్తసేవ చేయుచుండును. ఆమెకు కలుగు ప్రసవవేదన కాలమున ఈసంసారబంధన్యమే రోతగా భావించును కాని ప్రసవించిన మరునిమిషమునుండి ఆ భావన పోయి జననమందిన శిశుపోషణకై పాకులాడును. ఇది మానవస్వభావము.

82. మండు వేసవికాలములో శిరస్సుపై తలపాగ ధరించెదవు కాని స్త్రీలు షమిటచెంగు మాత్రము ముసుగు వేసికొందురు. వారికి శిరోజములు మెండుగా యున్నందున చాలును.

83. జ్యోతిలో తైలము తగ్గగానే జ్యోతితగ్గును. అట్లే గుణవంతులు సన్మార్గము నాచరించినంతకాలము కీర్తిప్రతిష్టలు పెరుగుచుండును. ఏకారణముచేతనైనను ప్రవర్తనలో మార్పు తటస్థించినపక్షమున వెనకటి వృద్ధి యంతయు నశించును.

84. దేవాలయమునకు వెళ్ళినవారు దేవాలయము చుట్టూ ప్రదక్షిణముచేయుట ఆచారము. అట్టి ప్రదక్షిణలు వేయి చేసినను జ్ఞానము అభివృద్ధికాదు. భక్తితో దేవాలయములోని విగ్రహములకు అర్చనలుచేసి ప్రసాదము ను స్వీకరించుము.

85. మానవు లందరు పూర్వజన్మ ప్రభావము వల్ల, ప్రాప్తించిన మానవజన్మను సద్వినియోగము చేసి తరించుట ఉత్తమము కాని అధర్మ, అరాచక ప్రవర్తనలుచేసి ఉత్తర జన్మలో హీనయోనియందు జననమందుట శోచనీయము.

86. నారాయణస్మరణలోని రహస్యం ఏమంటే ఈ "నా" అనే ఆత్మభావము సదా పూజనీయము. అట్టి భావము నకు ముఖ్యభాగము శిరస్సు. అట్టి శిరస్సులోని ముఖ్యభాగం కండ్లు, చెవులు, నోరు, ముక్కు. ఈ నాల్గు పరికరము లలో ఏది లోటు అయినను కళావిహీనమే. అట్లుగాక సర్వ

అవయవములు యుక్తముగా కలుగచేసెడి శక్తి ప్రభావము గల శక్తినే 'రాయుడు' అనతగును. అట్టి శక్తి ప్రతి ఆత్మ స్వరూపునకు కలిగినను, పూర్వజన్మ దోషములవల్ల అంగ హీనముగుచున్నాడు. కనుక అట్టి శక్తుల నొసంగు నామమే నారాయణస్వరూపము. ఇది తెలుసుకొన్నవారు యోగులు.

87. ప్రతిరోజు రాత్రిపూట పరుండినప్పుడు నీ శరీరములోని అవయవములు అంటే చెవులు, కండ్లు, నోరు,ముక్కు పని చేయుటలేదనిన భావన అది పొరపాటు. వాటి వాటి ధర్మములకు విశ్రాంతిఅనేది లేదు. వాటిని శరీరములోని ఆత్మపదార్థము ప్రశాంతతతో నిలవత్రొక్కుచున్నది.

88. చిన్నచిన్న పిల్లలు గారాబముతో ఏడుస్తారు. తల్లులు వారి కోర్కెలు తీర్చి ఆదరిస్తారు. ఇది గారాబము అంటారు. దీనికి ముఖ్యకారణము మాతృప్రేమ.

89 నల్లగాయున్న జంతువులలో ముఖ్యముగా దున్నపోతును యమధర్మరాజుయొక్క వాహనమంటారు. అంటే నల్ల ధనము తామసగుణాలక్షణము. దున్నపోతుకు ఆ లక్షణములు సహజలక్షణము. అట్టి తామసగుణముతో ప్రవర్తించిన వారిని శిక్షించు ప్రభువు యమధర్మరాజు కనుక దానినే ఆయనయొక్క వాహనము గా భావింపబడుచున్నది.

90. పచ్చికట్టెలు తెచ్చి ఎండబెట్టిన పిమ్మట వాటిని వంటచెరకుగా వాడతారు. పచ్చిపుల్లలుమండవు. అలాగుననే ప్రతి మానవునిలోని దుర్గుణములు నశించుటకు గురుసేవ అవసరం

91. పురుషులు స్త్రీలు అని రెండు తెగలుగా దైవము సృష్టించినాడు. పురుషుని ధర్మములు స్త్రీ ధర్మములు ఆ సృష్టికర్త నిర్ణయించినను నేటికాలములో స్త్రీలు ఉద్యోగములు చేయుచున్నారు పురుషులు వంటలు చేయుచున్నారు. ఇది కాలమహిమ

92 మానవులకు వాక్‌శక్తియున్నది. ఇతర జీవజంతువులకు లేకపోయినప్పటికి సర్వజీవజంతువులు వాటివాటి అవసరములను పొందుచున్నవి మానవుడు తననోటితో అనేక అబద్ధములనాడి పొట్ట నింపుకొనుచున్నాడు.

93. చిఱుతపులికంటే పెద్దపులి ఆకారమున పెద్దది- స్వభావగుణములు ఉభయులవి ఒకటే- అటులనే మానవులందరు పొడుగు పొట్టి యున్నను వారివారి ప్రవర్తనలన్నియు సమమే.

94 పురుషుడు కాయకష్టంచేసి ఆర్జించుతాడు. స్త్రీ పురుషుని పోషణకు తోడ్పడుతుంది. ఇది ప్రాపంచక ధర్మం.

95. గురువుగారు బోధ చేయుచున్నారంటే శిష్యుని తనంతటివానిని చేయుటకు, మరిన్ని తనకు కలిగిన జ్ఞానమునూ, లోకములో వెదజల్లుటకును అయియున్నది.

96 పరపురుషులను తండ్రులవలె భావించవలెనూ- మరిన్ని తన భర్తయందు అనురక్త కలిగి ప్రవర్తించుటయూ స్త్రీయొక్క పాతివ్రత్య ధర్మం.

97. చేతులో పడిన అప్పు బాది తరుముతాడు. కాని ఆ చేనే వదలివెళతారు మరణకాలమున-

98. దుంపకూరలు అరగక బాధపడతారు. కాయకూరలు సర్వశక్తికి తోడ్పడుతవి. ఆకుకూరలు మలమూత్ర విసర్జనకు తోడ్పడుతవి.

99. పురుషులు వేలాదిమంది తమ భార్యలను చావబాదుతారు కాని స్త్రీలు ఓర్పువహిస్తారు. దీనికి ముఖ్యకారణము తాను ఆర్జితపరుడనని తన సహాయము స్త్రీకిఅవసరమని తలంపుతో గర్వించి చేయు అధర్మప్రవర్తన.

100. నానాజాతి పురుషులు రూపములో ఒకటే అయినను వారివారి మత ఆచారములనుబట్టి ధరించు దుస్తులు వేరువేరుగా యుండును.

101. దివారాత్రులు ఎల్ల వేళల ఆ పరమాత్మ ప్రతి జీవియొక్క గర్భవాసములో యుండి సూర్యుడు పగటిపూట చంద్రుడు రాత్రిపూట మనచర్యలను గమనించుచుండినట్లుగా మనశరీరములో మూలగున యుండినను, మనహృదయ పరితాపములను గమనించుచున్నాడు

102 పురుషుని చూచినప్పుడు స్త్రీ సిగ్గుతో శరీరమును పమిట చెంగుతో కప్పుకొనుట పూర్వఆచారము నేడు పైట చెంగు భుజంవరకు మాత్రమే యున్నందున ఆ ఆచారము మంటకలసినది.

103, దివారాత్రములుఅనక మానవుడు ఉదరపోషణకుగాను, శ్రమపడి ఆర్జించుచున్నాడు అట్లు ఆర్జించిన పైకముతో ఆలుబిడ్డలు ఆనందముగా అనుభవించుచున్నారు. కాని వృద్ధ మాతాపితరులను పోషించుటకు విసుక్కుంటారు.

కొడుకు తెచ్చే సంపాదన ఆలుబిడ్డలకే చాలక బాధపడు తున్నామని, వృద్ధులకు చాకిరీ చేయలేకుండా వున్నామని, వారిని భరించుట ఒక బరువుగా తలుస్తారు తిరిగివారు వృద్ధులైనప్పుడు తమబిడ్డలు ఇదేచదువు చదువుతారని గ్రహించరు ఇది లోకస్వభావమైనది,

104. పడగటింటిలో బూజు తరచుగా దులపరు- ఇది ఒక దురభ్యాసము- సాలిపురుగు వంటపదార్థములలో పడిన యెడల ఆ వంటపదార్థమంతయు విషమగును- తిన్నవారందరికి ప్రాణమోసం గనుక శ్రద్ధతో ప్రతివారము దులపండి.

105. నవనవలాడుతూయున్న గన్నేరుపువ్వులు తెచ్చి తలలో అలంకరించుకుంటారు. శిరస్సుకు అలంకారమే కాని ఆ పుష్పములలో దాగియున్న దోషం గుర్తించరు. గన్నేరు వేరుమొదలు పువ్వు, ఆకులు సమస్తము విషవాయువులో పెంచబడినవి. అందువల్లనే పూజకు నిషేధములు

106. పన్నీరు అంటే గులాబీపువ్వులతో తయారుచేసిన నీరు. ఇది సువాసనగలది అందువల్లనే శుభకార్యములలో వచ్చిన బంధువులపై జల్లి ఆనందిస్తారు

107. గోరింటాకు రుబ్బి గోళ్ళకు పెట్టుకొంటారు— అందువల్ల గోళ్ళలో దాగియున్న మలినదోషం హరిస్తుంది. గోళ్ళవ్యాధులనుంచి కాపాడుతుంది

108 చిల్లగింజ గంధంతీసి మంచినీటిలో కలుపుతే నీటిలోని మురికిపదార్థమంతయు అడుగున తెట్టకట్టుతుంది.

109. పావురములు జంటలుజంటలుగా ఆకాశములో విహరిస్తవి. వాటి నివాసస్థానమును పైనుంచి గమనించుచూ విశ్రాంతి కోరినప్పుడు తిరిగివస్తవి. ఇది పక్షిస్వభావము.

110. ధనవంతులు వారి ఐశ్వర్యం చూచుకొని ఆనందిస్తారు- కాని వారిలో ఇసుమంతైన పరోపకారబుద్ధి ఇమిడియున్న యెడల వారి ధనరాసులకు కొదవకలుగునని భీతిచెందుతారు- ఇది లోకస్వభావము

111. సినిమా ప్రేక్షకులకు లభించే ఆనందంకంటె అవినీతిప్రవర్తనలే మెండు

112 అమ్మ కొట్టనా, తిట్టినా ప్రేమ భా వ ము నశించదు

113. ఈ ఇల్లు నాది అని తలంచుట వెర్రితనము ఇంటిలో పిల్లులు, ఎలుకలు, బల్లులు, నల్లులు,చీమలుదోమలు మరి అనేక జీవజంతువులు నివసిస్తూయుంటే నీ ఒక్కరిది యేలా అవుతుంది?

114. దేవాలయములో గంటకొట్టతారు దేమునికి చెవుడా లేక పూజారికి చెముడా?

115. ఆవుపాలు శ్రేష్ఠమంటారు- కాని పెంచడము వస్తే బర్రెపాలు చిక్కన, పోషణ ఖర్చుతక్కువ అని బర్రెనే పెంచుతారు- అంటే పాల గుణమునకు విలువయివ్వరు.

116. దోమలతో బాధపడతారు కాని ప్రాంతములోని మురికిగుంటలు శుభ్రపరచరు.

117. మితముతప్పి భుజించి, జీర్ణశక్తి తగ్గినదంటూరా కాని ఆహారనియమముల పాటించరు.

118. మొక్కుబడులకోసం జీవహింస చేసేవారి హృదయములో జాలి అనేది హారతికర్పూరంవలె హరించి పోతుంది.

119 పగటినిద్రకు కారణం సినిమాలు ప్రయాణము.

120. హోటలు తిండి తినేవారికి ఇల్లాలు ఆకలి తెలియదు.

121. శ్రోతలు రసికులవుతే గాయకులకు ఆనందము.

122. ఉంపుడుకత్తెలమాటలకు ఉబ్బిపోతారుకాని వారి హృదయములో దాగియున్న దొంగప్రేమను గుర్తించలేరు.

123. గృహస్తులు పగటిపూట సూర్యునికి నైవేద్యముగా పాలు పొంగిస్తారు- వేశ్యలు వెన్నెలలో చంద్రునికి పాలుపొంగిస్తారు.

124. హిందువులు తరచు సత్యనారాయణ వ్రతము చేస్తారు కాని సత్యమును పాటించుట గుర్తించరు.

125. దొంగలు వచ్చేది నీకొరకుకాదు- పరోపకార బుద్ధిలేకుండా నీవు కూడబెట్టిన వారిభాగమును వారు గైకొనుటకు మాత్రమే-

126. ప్రజలలో నీతి కొరతవచ్చినప్పుడే పోలీసువారి అవసరం. ప్రజలు నీతివంతులుగా ఉంటే పోలీసుశాఖ అనవసరము.

127 శారీరక మానసిక దుఃఖములు, జనన మరణాది పరివర్తనములు అను గోతులతో గూడిన ఈ సంసారమునుండి తప్పించుకొనినవాడు ఉత్తముడు-

128 ధనసంపద అనర్థముకొరకు, భోగసమూహము సంసారరోగముకొరకు సంపత్తులన్నియు ఆపదలకొరకు నిర్మింపబడినవి- అది తెలిసి ప్రవర్తించినవాడు బుద్ధిమంతుడు.

130 రాజ్యముకంటెను. వనితాసంగమము కంటెను, నిరాశత్వము అధిక సుఖమును కలుగ చేయును.

130. ద్వేష అసూయాభావములకు మూలకారణము అతి ఆశ-

131 ప్రేమభావము పెరిగినకొలది ద్వేష భావము నశించును-

132 పొరుగువారి కష్టములలో నీవు పాల్గొని నప్పుడు అసూయాభావము నశించును

133 మా రణయంత్రములు పెరిగినకొలది సైన్యబలము పెంచబడి, దేశ ఆర్థిక పరిస్థితులు తారుమారగును.

134. కుల ద్వేషములు నశించుటకు ప్రథమమెట్టు శాఖాభేధములు తొలగించుట-

135. పుట్టబోయే శిశువు పోషణకుగాను తల్లికి స్తనముల నిర్మించు దైవమునకు, నీ పోషణభారము తెలియదా! అది గుర్తించక ఎన్నో మాయలుపన్ని సంపాదించి మూటలు కట్టుచున్నావు- అది నీ వెర్రితనముకాదా!

136. ఏ జన్మలోనో నీవు ఋణపడిన బాకీ తీర్చుకో మని బిచ్చగాని రూపమున నీగడపను వచ్చినవానిని గుర్తించక పొమ్మంటే ఋణవిముక్తికొరకు మరుజన్మ ఎత్తవలసియున్నది గనుక జన్మలసంఖ్య తగ్గుటకుగాను వెంటనే వాని మొర ఆలకించు-

137. చీకటిరాత్రులలో దొంగలు నీసొత్తు అపహరించకుండా కుక్కలు మొరిగి హెచ్చరించుచున్నవి. కాని వాటికి ఒక కవళం అన్నం వేయకుండా లోభిస్తూ యున్నావు అది నీకు ధర్మమేనా?

138. ధర్మము తెలిసిన తనయుడుధనమునకు వెరువడు.

139. రుచికొరకు వేరువేరు పదార్థముల భుజింతురు- ధర్మముకొరకే వేరువేరు గ్రంధముల పఠింతురు- దానముకొరకే వేరువేరు పూజలు చేయుదురు- దేవునికొరకే వేరు వేరు మతము లాచరించెదరు-

140. స్వామి పాదసేవచేయు ధర్మపరులు
స్వామి దర్శనముకోరు సద్భక్తులు
స్వామి నీడకోరు సత్పవిత్రులు
స్వామి చెంతచేరు సత్యవంతులు.

141. తల్లినిప్రేమించు తనయుడు, గురుని ప్రేమించు శిష్యుడు ధర్మము ప్రేమించు పరిపాలకుడు, దైవముప్రేమించు భక్తుడు-

142. ధనముకొరకు చోరులు, పరాంగనలకొరకు జారులు, ధర్మముకొరకు రాజులు, మర్మముకొరకు మనుజులు దైవముకొరకు భక్తులు నల్దెసల వెదకుచుందురు.

143. మతిచెడి తిరుగు మనుజుడు, గతిచెడి తిరుగు భిక్షుకుడు, నీతిచెడితిరుగు మోసగాడు, సతిచెడి తిరుగు జారుడు

144 భూగర్భములోని ఖనిజములు, గనులలోని మణులు, సముద్రములోని ముత్యములు, వనములలోని మూలికలు, మహాత్ములలోని త్యాగములు విలువకట్ట నేరితరమా ?

115. బీజములోని వృక్షము, గర్భములోని శిశువు, పుట్టలోని సర్పము, ధర్మములోని ఫలము నిర్ణయించుట దుర్లభము.

146. కరెంటు దీపములు అలవరచుకొనినకొలది కండ్ల వ్యాధులు పెరిగినవి.

147. నిస్వార్థసేవ చేయువాడు, తను చేయు ప్రతిపని దైవసేవగా భావించును

148 నిన్ను నీవు తెలుసుకొనుటయే దైవమార్గము.

149. భక్తి అనే పత్రము నాటి, విశ్వాసము అనే వ్రేళ్ళు కలుగుటకు భక్తులసేవ యనే వర్షముతో పెంచి, దైవమును తెలిసికొనుము

150 ఏపనికైనా తొలినాడు ఆనందం మరునాడు వుండదు.

151. చంద్రుడుఉదయించినాడంటే వేశ్యలకు దొంగలకు ఆనందము.

152. ప్రభువు సోమరిపోతు అయితే సేవకులకు ఆనందము

153. తమ్ముడు తెలివిగలవాడు అయితే అన్నకు అసూయ.

154. చిల్లగింజ అరగతీసిన గంధం నీటిని శుభ్రపరచును కలుషితహృదయుని మనస్సు త్రిప్పుటదుర్లభము.

155 చలిగాలిలో మంచం వేసుకుని పడుంటే చలికి బట్టలు కప్పుకోవలెను. చీకటిరాత్రిలో పడుంటే దీపం అవసరం. వెన్నెలరాత్రిలో పడుంటే ఏమీ అవసరంలేదు.

156. చితుకులు ఏరుకుని వంట చేసుకుని భుజిస్తారు కడు బీదవారు గొప్పవారు యంత్రసహాయముతో వేడిని ఉద్భవింపచేసి వంట చేసుకుంటారు ఇద్దరికీ ఆకలి తీరుతుంది.

157 పడుండియుండినను, కూర్చుండియుండినను, నిలుచుని యున్నను, ప్రయాణము చేయుచున్నను అంతరాత్మ నీ హృదయములోనే యుండును.

158. చిన్నతనములో తల్లిదండ్రులు, వయస్సులో భర్త, వృద్ధాప్యములో బిడ్డలు నీ పోషకులు.

159. పగటిపూట ప్రయాణము చేయవలెను, రాత్రిపూట విశ్రాంతి తీసుకోవలెను.

160. చెమట పట్టినప్పుడు పై బట్ట తీసి గాలికి శరీరము ఆరబెట్టవలెను.

161. చిన్నబిడ్డలను అదలించకుము. వారి లేత హృదయములకు నొప్పి కలుగును.

162 పసిపిల్లలు మంచములో ఏడుస్తారు ధనవంతులు సంపాదన లేదని ఏడుస్తారు, గయ్యాళిభార్యలు భర్త సరిగా చూడ లేదని ఏడుస్తారు. బీదపిల్లలు ఆకలిబాధతో ఏడుస్తారు.

163 మంచమునకు నాల్గు కోళ్ళు త్రికోణమునకు మూడుకోణములు, జంతువులకు రెండు కొమ్ములు తేలుకు ఒకే కొండి.

164 పరుండినా, కూర్చుండినా, నిద్రించినా, వ్యాపారి లాభం కోరుతాడు- వైద్యుడు రోగులను కోరుతాడు.

165. తాడు తెగి చాద నూతిలో పడితే గేలంవేసి తీస్తారు తడిబట్ట మురికిపట్టితే బండకేసి ఉతుకుతారు. గడ్డం పెరిగితే మంగలి గొరుగుతాడు, కాని ప్రాణం పోయిన జంతువులను కుక్కలు నక్కలపాలు చేస్తారు.

166. గేదెపాలు చిక్కనంటారు, గొర్రెపాలు నుసుగు అంటారు, మేకపాలు వేడి అంటారు, ఆవుపాలు శ్రేష్ఠం అంటారు.

167. పసిపిల్లలకు దాయిపాలు యిప్పిస్తారు, దాయి భావములే శిశువుకు అబ్బును.

168 సూర్యుడు ఉదయకాలంలో మధ్యాహ్నం వేడిగాను సాయంత్రంవేళ చల్లగాను ఉంటాడు- కాని కిరణసహస్రయుడు ఎల్ల కాలముల ఒకేరీతిని ఉంటాడు.

169 చిన్నచిన్న గుడిశెలలో నివసించేవారు గాలికి ఆరబైట పడుంటారు. శ్రీమంతులు చీకటిగదులలో పడుంటారు.

170. చీకటిబజారులో వస్తువులు కొంటే దొంగలు వెనువెంటనే గుర్తించి మీఐశ్వర్యమును అపహరిస్తారు.

171. సాహేబులు పిల్లలకు సులిచేయిస్తారు ప్రభుత్వము పెద్దవారికి సంతాననిరోధక ఆపరేషన్లుచేయిస్తారు.

172. పశువులు ఋతువు తెలిసిక్రీడించును. మానవులు సర్వకాలములయందు క్రీడించును.

173. పూర్వం చేతినాడి చూచి శరీరదోషము తెలుసుకొనేవారు, ఈనాడు మల, మూత్ర, రక్తపరీక్షలుచేసి తెలుసుకొనుచున్నారు.

174. పూర్వకాలం జాతకచక్రంచూచి జీవితకాలం నిర్ణయించేవారు, ఈనాడు పొడవు, తూకం యిత్యాదివి వాటితో జీవితకాలం నిర్ణయిస్తున్నారు.

175 యాత్రికులు పుణ్యక్షేత్రములు దర్శించుటకు ప్రయాణం చేస్తారు, వర్తకులు సరుకులుకొనుగోలుకు ప్రయాణంచేస్తారు. యాచకులు బిచ్చమెత్తుటకుప్రయాణం చేస్తారు. దొంగలు ప్రయాణీకులసొత్తు అపహరించుటకు ప్రయాణం చేస్తారు.

176 రైలుప్రయాణికులు అరటితొక్కు ప్లాటుఫారం మీద పారవేస్తారు. ఆలస్యంగా వచ్చేవారు పరుగెత్తి త్రొక్కి త్రొక్కి కాలుజారిపడతారు.

177. భర్త కోపించి భార్యను కొడతాడు, భార్య కోపించి భర్తకు బదులు బిడ్డలను చావబాదుతుంది.

178 శ్రీమంతులు విమానములో కాశీకివెళ్ళి పెద్దల హాస్తికలు గంగలో కలుపుతారు,బీదవారు పాంతముయొక్క పారుదలనీటిలో కలుపుతారు, ఇద్దరికి ప్రాప్తించే పుణ్యం సమానమే.

179 ధనవంతులు గంజివార్చినఅన్నంతిని రోగాలతో బాధపడతారు, బీదలు గంజిఅన్నం తిని ఆరోగ్యంగా కాయ కష్టంచేసి ఆనందించుతారు.

180. పల్లెవాళ్ళు గోచీపెట్టుకొని నీళ్ళలో తడుస్తారు, ఆరోగ్యంగా ఉంటారు- శ్రీమంతులు వేడినీళ్ళు స్నానం చేస్తారు, జలుబుజబ్బులు చెల్లిస్తూవుంటారు.

181. పుత్రుడు పురుడంటారు- అది ప్రసవించినవారికా? బంధుకోటికా?

182. చనిపోయినవారికి తిలోదకాలు యిస్తారు. అంటే చనిపోయినవారి ఆస్థికి భాగస్వాములమని చెప్పడానికా?

183. దీపంలో చమురు తగ్గుతే దీపం ఆరిపోతుంది. పెట్టెలో పైకం తగ్గుతే బంధువులు తగ్గుతారు.

184. చిన్నఅబ్బాయి సెంకి, పెద్దఅబ్బాయి పోగా, బోతు, బుల్లిఅబ్బాయి కొంటెగాడు, చంటిఅబ్బాయి గోంగి ఇందులో ఎవరు నాకు పేరుతెస్తారు.

185. పశువులు వేటగానిచూచి పారిపోతవి, పక్షులు బోయవానిజూచి పారిపోతవి, నరులు దుర్మార్గులనుజూచి పారి పోతారు, భూపరిపాలకుడు పరరాజులనుజూచి పారిపోతాడు.

186. శని మహాదశ వచ్చినదంటే కొందరు దానాలు యిచ్చి తప్పించుకుంటారు. కొందరు అష్టకష్టాలు అనుభ విస్తారు.

187. పరరాజులు దండెత్తి వస్తున్నారంటే దేశంలో ప్రజలు భీతితో మునిగి జీవిస్తారు.

188. పరధనమునకు ఆశించేవారుకూడా వారి ధనం పరులు అపహరిస్తారేమోనని జాగ్రత్తపడతారు.

189 దొంగలు ఆర్జించినదానిలో ఆచోకిచెప్పినవారికి ఒకభాగము, షరాబులకు ఒకభాగము, పోలీసువారికి ఒక భాగము, కల్లు సారాదుకాణదారులకు ఒకభాగము ఇవ్వగా మిగిలేది గంజినీళ్ళకే సరిపోతుంది.

190. దేవాలయములు కట్టేవారిలో పాపభీతినివారణకు కట్టేవారు మెండు.

191. వడ్డీవ్యాపారస్తులు బీదవారివద్దఅధికవడ్డీ ఆర్జించి దానవంతులవలె బీదలకుపాపభీతితో దానాలుచేస్తారు.

192 నీఅంగడిలో పదిమంది గుమస్తాలు పనిచేయుచున్నారంటే అంగడికివచ్చేవారి సంపత్తు వానిసహాకారముతో కొల్లగొట్టుచున్నావన్నమాట.

193. పదిఆస్తులపాడికంటె పదిబర్రెల పాడిలాభం.

194. చేగోడీలు కొనుక్కుంటె పిల్లల ఆకలితీరుతుంది పెద్దల ప్రైకం వదులుతుంది.

195 త్రికరణశుద్ధిగా యుంటే గంజే దొరకదు

196. అలంకారికములు వేయిధరించినా డొక్కశుద్ధి లేనిదే రాణించదు.

197. భూలోకము లోనున్న సకలజీవజంతువులలోను ఆత్మ గాలిరూపములో నివసించుచున్నది- అది ప్రవేశించుమార్గము గాని వెడలు మార్గముగాని కనుగొన్నవాడు యోగి- అతని ముఖములో అద్దమున్నది- ప్రతిబింబమువలె సమస్తము తెలుసుకొనును అట్టివానికి ఆకలిదప్పులులేవు- బంధువర్గము లేదు ఇల్లు వాకిలి లేదు సమస్త నదీప్రవాహములు సముద్రములో మిళితమై రూపములను భాసిల్లునట్లుగా వాని మనస్సులో ఏకోర్కలు యుండక ప్రయాణము చేయుచుండును.

198. చింతాకుపులుపు, కసింతాకు వగరుఅయినప్పటికి చింతాకే శ్రేష్టము.

199. పలువురుప్రయాణీకులు బసచేసేసత్రియజమాని వేరువేరుభాషలతో వారివారియోగక్షేమములను విచారించుచుండును కానితనభవిష్యత్తు గుర్తించడు.

200 నల్లనేరేడుచాయగల మనుష్యులు ఎర్రబ్బాకాయరంగువారినిచూచి విచారపడతారు- ఎందుకంటే తా సౌందర్యమువారికి లేక పాలిపోయినారని- తనలోనిరక్తము నలుపుగాయుండినను, పైచర్మముచాయగుర్తించరు-

201. ఇరుగుపొరుగువారు దొంగలవుతే ఇంటివారికి ఆనందము లేదు.

202 తలగొరిగినా మొగొరిగినా వెంట్రుకలు పెరుగును కాని మెడనరుకుతే తిరిగిబ్రతుకేలేదు

203. పుష్పమువడలినదంటే విచారపడరు అదస్వభావకమంటారు- మనిషి చనిపోయినాడంటే విచారపడతారు.

204. తామరాకునీటిలో ఉన్నంతవరకు వడలదు- తీసి ఒడ్డునపెడితే వడలిపోతుంది- అలాగుననేకుటుంబీకుడు గృహములోయున్నంతవరకూఆనందముగానేయుంటాడు కుటుంబమునుబాసిబైటకు వెడలినప్పుడు ఒంటరిగా బాధపడతాడు.

205. చాకలిరేవులో బట్టలు ఉతికి గంజిపెట్టి ఆరవేసి తెస్తే మనముకట్టుకునిఆనందిస్తాము. అటులనేమానవుడు స్నానంచేసి విభూతిధరించి దైవసన్నిధిని ప్రార్థించేస్తే దైవం ఆనందిస్తాడు

206. చమటపట్టినప్పుడు పైబట్టలుతీస్తాము- ఆకలి వేసినప్పుడుభుజిస్తాము అంగడికివెళ్ళి సరుకులు బేరమాడి తెస్తాము ఇంటికివచ్చినాక ఇల్లాలు వెలుపల ఉంటే వంటచేయుటకు విసుక్కుంటాము.

207. రామరామ యనిగొంతుఎత్తి భజనచేస్తాము రాముడుబిచ్చగానిరూపంలో నీగడపకువస్తే పొమ్మంటావు.

208. చెప్పులకుఅలంకారములు తగిలిస్తారు కాని చెవిటివాని చెవులలోచెప్పినను వినిపించక బాధపడతారు.

209. ఆత్మఅనే పదార్థమును చూడవలెనని ఎందరో ప్రయత్నించారు పెద్దలుకైనా:- నీవీపును నీవుచూడగలవా అలాగే నీగర్భములోయున్న నీఆత్మనుకంటికి గోచరము కానందున ఆత్మ అనే పదార్థము నీలోలేదని చెప్పగలవా? లేదు.

210. పరోపకారంచేశాడంటే తనభవిష్యత్తుకు నేల నాన్నిని త్తనములువేస్తూయున్నాడన్నమాట.

211. గాలిలేక బాధపడతారు- చెట్లనీడవిశ్రమింపక చీకటిభవనములలో చీట్లపేకలోపడి మునుగుతారు.

212. అలనాడు శ్రీరామచంద్రుడు అడవులకు వెళ్ళినాడంటేతండ్రిమాటజవదాటలేక కాదు పితృవాక్పరిపాలన కుమారధర్మమే- ఈనాడుతండ్రికిచదువుచెప్పతారుబిడ్డలు

213 పరోపకారంచేసేవారిసంఖ్య కంటె పరులఆస్థిఅపహరించేవారిసంఖ్యఎక్కువ.

214. దివారాత్రములు కష్టపడి- చమటలుపట్టతే- తుడుచుకుంటూరైతుపొలములో సేద్యంచేసి పండించి యజమానివద్దకుపంటవస్తువులు తెస్తే నీవుకొంత అపహరించినావు- చేనుమీదనేను లెఖవేశాను నిజంచెప్పాయనిబెదిరిస్తాడు మరెన్ని

కట్టుబడిమించిరావలెననిపోట్లాడతాను- ఇదియజమానిలక్షణ

215. ఆవుమందలు యెన్ని ఉన్నా మాడ లేగదూడ ఠక్కున తనతల్లి వద్దకు చేరుతుంది- పసకసు ఎంతదూరంగు లోయున్నా యజమానిని గుర్తిస్తుంది- పందిపిల్లలు ఎం స్త్రీగా ఉన్నా అన్నింటికి కడుపునిండా పాలు ఇస్తుంది- అంగడివానివద్ద ఎన్ని సరుకులు ఉన్నా నీవుకోరినది వెతకి తెచ్చిఇస్తాను

216 పలువురు పెద్దమనుష్యులు ఒక మార్గమున వెళ్లుచూ ఒక ఇల్లాలునుచూచి ఈమె మహా భాగ్యవంతురాలు ఎందువల్లనంటే తలనిండా వెంట్రుకలు, మెడనిండా ఆభరణములు, చేతులనిండా గాజులు, పాదములనిండా మట్టెలు ధరించి నిండుగా వస్త్రము ధరించి మాగనిసెనకి ప్రయాణమై అత్తవారిఇంట సేవచేయుటకు వెళ్ళుచున్నది కొలదిరోజులలో గర్భవతియై తిరిగి పుట్టింటికి రాగలదు

217. చీమలు బారులుతీసి ప్రయాణముచేయుచున్నవి అంగడిలోని బెల్లంగడ్డనిండా చీమలే

218. దోమలు, నల్లులు మెండుగా యున్నవంటే గాలి లేక నిదురపట్టక చీకటిగదులలో పరుండువారు పొందే ఆనందం.

219. పగలు రాత్రి అనకుండా పదిరోజులు ప్రయాణముచేసి కాశీకివెళ్ళి గంగలో స్నానం చేసినతరువాత ఇంటికి వచ్చి బంధుకోటికి విందులుసలిపి, తమకు కాశీకివెళ్ళి తట్టెడుపుణ్యాం సంపాదించామని ఆనందిస్తారు. కాని ఇంటి ప్రక్కన

ఆకలి బాధతో యున్న ముసలమ్మకు గంజిజావకూడాపోయరు.

220. పులులతో వేటాడి పులిమాంసం తిన్నామని, పులిగోళ్ళు తెచ్చి మెడలో కట్టుకుంటారు- పిల్లి వస్తూయున్న దంటే ఎలుకలవలె పారిపోతారు.

221. చిన్నతనములో ముసలమ్మలు అన్నం కలిపి తినిపిస్తారు- వయస్సులో భార్య తినిపిస్తుంది- ముసలితనంలో మనుమలు మొట్లుమొట్టి తినమంటారు.

222 నీవు నేను అనే పదము ఈ శరీర రూపములను బట్టి కల్పింపబడినవి- ఈశరీరము నశించినపిమ్మట ఈ నీవు, నేను అనే జీవులు గాలిలో మిళితమై ఏకరూపమునే దాల్చు చున్నది- ఈ భేధమంతియు ఈ కాన్పించు శరీరమునకే గాని శరీరములో దాగియున్న ఆత్మకుకాదు.

223. జానకీదేవి సకల ఐశ్వర్యవంతురాలయినను గృహస్థుధర్మం పాటించుటకే భర్తవెంట వనములకు వెళ్ళి అష్టకష్టములు అనుభవించి, భర్తకుకూడా దూరమై, పాతివ్రత్యధర్మమును పరిపాలించి భూలోక ప్రజలందరికి ఒకఆదర్శ గృహిణి యైనది_ ఆమె ఆనాడు అనుభవించిన బాధలకుగాను ఈనాడు ఆమెను దైవముగా ఆరాధించుచున్నారు.

224. తలవనితలంపుగా ఈనాటి మధ్యాహ్నంవేళ ఒక బాలుడు నాచెంతకు వచ్చి నన్ను కావలించుకుని ఏడుస్తూ వుంటే జాలికలిగి ఏమి నాయనా ఎందుకు ఏడుస్తూవున్నావు అని అతి నమ్రితతో ఆబాలుని ఓదారుస్తాము- అటులనే

ఏదినిబోధించూ ఆకలి ఆకలి యని గొంతెత్తి అరచే యాచకుల మొర ఆలకించము- ఇది మానవస్వభావము- ఈ విధానములో మార్పు కలిగిననాడు దేశములోని ప్రజలెల్లరు ఆనందముగా జీవయాత్ర చేయగలరు- అంతేగాని ఈ కఠినహృదయము కరుగనిదే ప్రజలు క్షేమముగా యుండజాలరు

225. పరుగుస్త్రీలు బావికడకేగి తమ భర్తల దోషములను చెప్పుకుంటారు- అంతేగాని తమ సహనశీల దోషము లను గుర్తించరు.

226 పిల్లవాడు ఏడుస్తున్నాడంటే తల్లి పరుగెత్తుకు వెళ్ళి ఓదారుస్తుంది- కాని పక్కింటి పిల్ల ఒళ్లు కాలిన దంటే వెళ్ళి ఉపచరణనైనా చేయదు.

227. తమలపాకులు పది నమిలి ఉమ్మివేస్తారు- అది ధర్మంకాదు, ఊటమ్రింగి పిప్పి ఊయవలెను- అప్పుడు నీకు జీర్ణశక్తి పెరుగును.

228. ఆవకాయపచ్చడితో భుజిస్తారు- నిమ్మట ఒక ముద్దఅయినా పెరుగుఅన్నం భుజిస్తే ఆదోషం పోతుంది.

229. చామదుంపలపూరా మెత్తగావండి మజ్జిగ అన్నములో నంజుకుంటారు కొందరు- మరికొందరు నేతిఅన్నంలో పిసుక్కొని తింటారు, దేనిరుచి దానిదే.

230. చంటిపిల్లలు చిన్నప్పుడు లాగూలో ఉచ్చ పోసుకుంటారు- పెద్దవారు అయినప్పుడు ఎవరికీ కనుపించకుండా మరుగుస్థలంలో పోసుకుంటారు- ఇది ఈనాడుకూడా ఆచార ధర్మమే

231. పశువులు జంటలుజంటలుగావచ్చి పచ్చికబయళ్ళలో పరుగెత్తుచూ రంకెలు వేయుచూ గడ్డిమేస్తూఉంటే యజమానికి ఆనందం.

232. జీవనదులు అన్నీ ప్రవహించి, ప్రవహించి సాగరసంగమం చేయుచున్నవి కొంటెపిల్లలందరు సాయంత్రం బడి వదలగానే గుంపులుగుంపులుగా ఇండ్లకు పరుగెత్తుతారు.

233. దుంపపసుపుకొమ్ము వేడిని తొలగించును. ఆవగింజలు నీలోని అజీర్తిదోషము పోగొట్టును, చిల్లగింజ నీటిలోని మకిలిని విడదీయును దీపము చీకటిని పోగొట్టును. గొడ్డురాలు గర్భవతి కావలెనంటే గోంగూరాకుపసరు వరగడుపున పిసికగా పదరోజులు చేదు అనకుండా పుచ్చుకొనుచు త్రాగవలెను.

234. ఆవనూనెతో చేసిన వంటకములు చెడిపోకుండా పదిరోజులవరకూ యుండును. పప్పునూనెతో చేసినవి మరుసటి దినమునకే ఇగిరిపోవును, దోసనూనెతో చేసినవి నాలుగు రాత్రులవరకూ యుండును కాని నేతితో చేసినవి వేడి తగ్గగానే రుచి చెడును.

235. చిక్కుడుగింజలు ఉడకవేసి తింటారు. అది ఆరోగ్యమునకు మంచిదే కాని దానివల్ల తిన్నవారికి చిక్కులు మిక్కుటముగా కల్గును.

236. వేపగింజలు చేదు. వేయించి చూర్ణం చేసి మజ్జిగతో తింటే నీ గర్భములోని సకలదోషములు మటు

మాయ మప్రతవి. చేతచిగుళ్ళు అలవాటుచేసుకుంటే నోటి దుర్వాసన నశిస్తుంది. పులి తేపులు పోతవి.

237 నమోడే నారాయణస్వరూప మంటారు- నే నంటాను, ప్రతి జీవజంతువులో ఆ నారాయణ స్వరూపము వున్నది. నీవు మనస్సు నిలకడతో చూస్తే తెలుసుకుంటావు. అందుకే ప్రహ్లాదుడు స్థంభములో యున్నాడని తండ్రికి హితము చెప్పినాడు.

238. శంభోశంకర యని ధ్వనిచేస్తూ శంఖం ఊదు తారు, మెడలో లింగకాయ ధరిస్తారు- ఆలింగం నన్నని రాతిముక్క అయినను దైవభావనతో గ్రహించినారు కదా? అట్టివారుకూడా ఎన్నో కష్టములు అనుభవించుచున్నారు- వారి జీవితములుకూడా ముగియుచున్నవి- కనుక మనము గ్రహించవలసిన ముఖ్యవిషయం దోమలోకూడా యున్న ఆ దైవము ఏదోరూపములో మనయందుగూడం యుండగా ఈ మాయవేషములు ఎందుకు నాయనా?

239. సర్వ జీవరాసులకు వేరువేరు పోషకపదార్థము లు దైవముచే సృష్టించబడినను, రుచుల కొరకు బాధ పడు చున్నావు. ఆ రుచులే నిన్ను దొంగతనము, లంజతనము, అసూయ, ద్వేషభావములతో అసత్యప్రవర్తకునిగా మార్చు చున్నది గనుక తృప్తితో లభించినదానిని దైవప్రసాదముగా అనుభవించు.

240. ఈర్ష్య, ద్వేషము, అసూయ ఇత్యాది లక్షణ ములను విడనాడుము.

241. ఒకనాడు నీకు తిండి లేకపోయినందున యితరు లనుదూషింపకుము- అది నిపూర్వజన్మదోషఫలముగాభావించి భావికడ నీపశ్చాత్తాపపడి తృప్తి చెందుము

242 రాజాధిరాజులుకూడా రాజ్యములు పోయి దీనులై తిండిగింజలకు బాధపడినవారి చరిత్రలు యెన్నో విన్నావు- అందువల్ల మనము నేర్చుకోవలసిన ముఖ్యవిష యము ఏమనగా శిబిలు చెప్పరాదు; చెప్పిపోవు గనుక కలిగి నప్పుడు గర్వించక పోయినప్పుడు విచారపడకుము.

243 జీవి అంటే ఒక సూక్ష్మ రూపములో నీటి బిందువులోని వెయ్యోవంతు పరిమాణముగల అగోచర వస్తువు. దీనినే తెలుసుకొనలేక వేలాది గ్రంథములను పఠిం చుచూ పండితుల సేవచేయుచూ దేశాటన చేయుచూ మతి చెడినవానివలె కొందరు గుహలలోను, నదీప్రాంతములలోను, అటవులలోను తిరుగాడుచూ లభించిన పదార్థమును భుజిం చుచూ, లభించనినాడు వాయుభక్షణ చేయుచూ దేశము నలుమూలలా వెదకుచూ అష్టైశ్వర్యములను విడనాడి గోచీపాత ధరించి అటుయిటుపాత్రతో నీ గడపన నిలిచినయోగి పుంగవునికి సపర్యలుచేసి అతిథి-అభ్యాగతులనోవచ్చి, దైవమే ఆ స్వరూపములో నీకు ముక్తి కలుగచేయుటకు వచ్చినట్లుగా భావించి ఆనందించు. అంతేగాని అగౌరవ భావముతో పరిశ్రమించకుము,

244. సకల ఐశ్వర్యములు క్షణభంగురములు- ఉద యము ఉదయించిన సూర్యుడు సాయంత్రంలు అస్తమించినట్లుగా తరలిపోవును.

245 ఈ జీవితకాలము ఒక పగలుగాను మరణము ఒక నిద్రగాను భావించినవాడు జ్ఞాని.

246. ఈ శరీరములోయున్న సమస్తనాడులలో ఏ ఒక్క నాడికి ఆటంకము కలిగినా ఈ జీవితమునకు భంగము కలుగునుగదా! అటులనే నీ రాజ్యములోని ఏ ఒక్క జీవికి బాధ కలిగినను దానిదోషము రాజ్యాధినేతదిగా భావించి రాజ్యపాలన చేసినవాడు ప్రభువుగాని మిగతావారంతయు రాక్షసులనే భావించవలసి యున్నది. ఇది గొప్ప ఆదర్శ భావముగా తలంచి ప్రతిమానవుడు తన సంతతివారియందుగా సేవకులయందు ప్రవర్తించవలెను.

247 దివారాత్రములు అనక ఎల్ల వేళలయందు దైవ సేవచేయు భక్తులు వున్నారు అట్టివారికి ప్రతిరోజూ ఆకలి దప్పికలుఉండినను వాటియందు మనస్సుపోకుండా ధ్యాననిష్ఠలోనేయుండి ఆ పరమాత్మ పాదసేవ చేయుచున్నారు. వారు సాధారణముగా వారి విషయములు ఇతరులకు చెప్పరు. ఇతరులకు తెలిసి అడిగినను ఆడంబరముగా తెలియనివ్వరు. అట్టివారిలో కొందరు ఆశ్రమములలో తలదాచుకొంటారు. ఒకరిని అర్థించరు. ఒకరిసొత్తుకు ఆశపడరు- ఎవరైనా స్వేచ్ఛగా ఆహార పదార్థములు యిస్తే, దైవప్రసాదముగా భుజించి ఆనందించుతారు.

248. చీకటి రాత్రిలయందుగాని వెన్నెల రాత్రిలయందుగాని భేదములేకుండా నిద్రపోక ఎల్లవేళలా ఆ దైవ నామస్మరణ చేయుచు ఆశ్రమములలోయుండి ఆకలిబాధకు

గాను ఆకులు, పుష్పములు ఇత్యాదివి భుజించువారు పలువురు ఈనాడు హిందూదేశములో పలుప్రాంతములలో యున్నారు. వారిని గుర్తించునారు కరువైనారు.

249. ధనవంతులు చీకటిబజారుల వెంట పరుగులిడి ధనము సంపాదించి మూటలుకట్టి సంగనాసులవలె అమాయకముగా మాట్లాడతారు- అందుతే గొంతికోస్యయ కొరికివేస్తారు.

250. చితుకులు దొరకక తిండిగింజలు నీళ్ళలో నానవేసుకొని తినేవారు ఉన్నారు. శ్రీమంతులు వేడినీళ్ళతో స్నానం చేస్తేనేగాని భోజనముచేయరు,

251. పరాంగనలు కూడిగూడి గుసగుసలాడుకొనుచున్నారంటే వింత తన భార్యాకూడా ఆగుంపులో వుంటే చీవాట్లు పెడతాడు- కాని తను సాయంత్రం స్నేహితులతో కూడి చీట్లపేక ఆడి వట్టిజేబులతో ఇంటికివస్తాడు- భార్యాకూతలు తేలేదంటే గురగురలాడతాడు. ఇది మానవ స్వభావము.

252. అడవిజంతువుల పోషకవస్తువులు అడవులలోను నీటిజంతువుల పోషకవస్తువులు నీటిలోను లభించును- కాని నీ పోషకవస్తువులను నీవు గుర్తించక, సంచులుమరిగి, ఆశ పెరిగి అధర్మ ఆర్జితమార్గములతో కడుపు నింపుకొనుట అన్యాయము.

253. జీవాత్మ, పరమాత్మ, అంతరాత్మ అంటారు_ ఇవి

అన్ని ఒకటే- వేరువేరు సమయములలో వేరువేరు స్థానములలో వేరువేరుగా పిలువబడుచున్నది.

254. ప్రభువులు వేలాదిమంది సమావేశమై ప్రజాక్షేమమునకై వాగ్వివాదములు సలుపుతారు- అందరు స్వార్థపరులే.

255. సూర్యుడు అస్తమించినాడంటే చంద్రోదయకాలమైనదన్నమాట- రాజు మరణించినాడంటే యువరాజుకు పట్టాభిషేకదినం వచ్చినదన్నమాట.

256. ఈరోజు సాయంత్రం గురువుగారు పాఠం చెప్పలేదంటే ఆయన కడుపులో శూలనొప్పిబాధతో ఉన్నారన్నమాట- శిష్యుడు పాఠం రాలేదంటే నిదురమత్తు యెక్కువైనదన్నమాట.

257. తొలిజామున నిద్రలేచి స్నానంచేసి సంధ్యావందనముచేయువారు అరుదైనారు. కాఫీగ్లాసు చేతబట్టి పండుంపుల్లకోసం ఎదురుచూస్తారు.

258. చంద్రోదయకాలములో పక్షులు వాటినివాసములకు తిరిగి వెళ్ళుచుండును. మంత్రులు వారి కార్యస్థానములను వీడి వారి గృహములకు వెళ్ళుచుందురు- బడిపిల్లలు ఇండ్లకు వచ్చుచుందురు- తల్లులు బిడ్డలకు ఆహారములు వండుదురు- చాకలి రేవునుండి ఉతికి ఆరవేసిన బట్టలు తెచ్చును- తల్లులు దీపారాధన చేయుచుందురు- దోమలు ముసురును.

259. పలువురు శ్రీమంతులు గుమిగూడి వర్తకాభి వృద్ధి మార్గములను అన్వేషించుచుందురు కాని బీదలు కడుపు నిండా భుజించుమార్గము తలపెట్టరు.

260. చెట్లకు పూవులు పూచినవంటే కాయలు కాయు తరుణము వచ్చినదని తెలియును - ఆవు ఎద అయినదంటే ఆంబోతు చెంతకు తోలుకు వెళ్ళుదురు - కుర్రవాడు నిద్రపోలే దంటే కస్తూరిమాత్ర వేస్తారు.

261 చలిచీమల బారులవలె సైనికులు కూడా బారులు బారులుగా యుద్ధభూమిలోకి ప్రవేశించి హతులగు చున్నారు - వారు వారి కుటుంబరక్షణ, బంధుప్రేమలు వదలి రాజ్యధర్మంగా భావిస్తారు. కాని రాజయొక్క పరిపాలనా దోషములను పాటించరు.

262. ఈనాడు దేశములో ప్రజలు ఆకలిబాధ పడు చున్నారంటే దోషం మూడువంతులు శ్రీమంతులది. ఒక వంతు పరిపాలకులది.

263. చిన్నచిన్న పిల్లలు బంతులాడుకొనుచూ ఆనంద ముతో తిరుగుచుందురు శ్రీమంతులు మెడనిండా నగలు ధరించి బంధువులకడకు వేగుచుందురు. వ్యాపారస్థులు తెల్ల వారినదంటే వారి అంగళ్లు తెరచి వివిధపరుకులు శుభ్రపరచి విక్రయించుదురు. భక్తులు దేవాలయములకు వెళ్ళి పూజలు సల్పుచుందురు. కర్షకులు నాగళ్ళుతీసుకొని చోచోయనుచూ సేద్యము చేయుచుందురు. కాని ఈపరిస్థితులు నేడు తారు మారైనవి.

264. నవనీతము అనగా కొబ్బరినూనె కాచి దానిలో మరియితర పదార్థములు కలిపి చల్ల చేసినట్లుగా నివ్వముతో చిలుకుతే మీగడవలె కసుపుకట్టి తయారాగును- అది చాలా వ్యాధులను నివారణచేయును. అటులనే సోమరిపోతులను గురువులునూరి విద్యావంతులుగా చేయుదురు

265. బెల్లం, బెల్లం అంటారు- బెల్లం తీపి అంటారు- ఆతీపివనము సృష్టిలోనే దైవము చెరుకుగడలో కలుగచేసినాడు- ఆ చెరకుగడ చిదుగకొట్టి పిప్పితీసి రసం ఎండబెట్టి ఘనీభవింపచేస్తారు. వంటలుకిరాతుల వడుతాలపు కొంత కఠిన హృదయం మార్చలేరు.

266. ఉశిరికాయలు ఊడకబెట్టి మురబ్బా చేస్తారు- పువ్వులుఎండబెట్టి పానకములోవేసి గులకందచేస్తారు. నారింజకాయ రసంపిండి అందులో పంచదారవేసి కాచి మురబ్బా చేస్తారు- చింతపండు పులుసుతో పులిహోరచేస్తారు ఇన్ని చేస్తారు కాని దుష్టునిమనస్సు మార్చలేరు.

267. పిల్లి పిల్లి అని తోలుతారు- ఎలుకలబాధ పెరిగినప్పుడు పిల్లి రావడంలేదని తలుస్తారు.

268. దోసకాయ ఊడకవేసి పచ్చడిచేస్తారు- కరకాయలుచితుకకొట్టి సిరా చేస్తారు- గోంగూరఊడకపెట్టి పులుసు చేస్తారు- కవిరిరాసి తాంబూలము వేస్తారు- చెప్పులు చిరిగిపోకుండా నాడాలువేస్తారు- విసనకర్ర చిరిగిపోకుండా చుట్టూ గుడ్డ కుడతారు- సోమరిపోతుకాకుండా కాలికి కడియం వేస్తారు.

269. చింతచిగురుపులుపు, కందిపురద, వేపాకుచేదు బెల్లం, పంచదారతీపి, పొగరుబోతు ఆంబోతుకొమ్ములువాడి.

270. చీమచిటుక్కుమంటే కొందరునిదురమంచంనుంచి లేస్తారు- మరికొందరు కుక్కలు మొరిగినా లెగరు.

271. ధనలక్ష్మి ఇంటికివస్తేఎందుకువచ్చావు అనిఅడుగుతారు- ఆకలిబాధతోవచ్చానంటే పొమ్మంటారు మీ ఇల్లుబంగారం చేయడానికి వచ్చానంటే చాపవేసికూర్చోమంటారు.

272 పసిపిల్లలుముద్దు, బసిపిల్లలుకొంటి, బాలుడు అల్లరిచేస్తే ఆనందం- వయస్సువచ్చినవారు వస్తేమీ పెళ్ళి ఎప్పుడుమాకు పప్పుఅన్నం ఎప్పుడు పెడతావని అడుగుతారు. పెద్దవారు వస్తేనుగవారు ఇంట్లోలేరుఏమిచెప్పమన్నారు అని అడుగుతారు- ముసలమ్మ ఇంటికివస్తే మనుమలు చెవులు పట్టుకునిఆడిస్తారు- అమ్మవస్తూయుంటే ఎదురు వెళ్ళిచంక నెక్కుతారు- భర్తవస్తూయుంటే పకున త్రిపాయ్యి రాజేస్తారు - కాఫీకాస్తారు - ఇవి ఈనాటిముచ్చట్లు.

273. చిలగడదుంపలు వస్తే ఉడకవేసుకు తింటారు - మామిడికాయలువస్తేపచ్చడిచేయమంటారు - అరటిపళ్ళు వస్తేపంచుతినితొక్కలుఆవులకువేస్తారు- పాములవాడు వస్తూవున్నాడంటే అమ్మనుఅడిగిబియ్యం తెచ్చిపామును ఆడించమంటారు- ఇవి చిన్నపిల్లల లక్షణములు.

274. అయ్యో రామాయని ఏడుస్తూయుంటే పిల్లలు వీపుపై నెక్కి జుట్టుపీకుతారు.

275. చలి అని దుప్పటి కప్పుకుంటే చమట పోయడం లేదాయని దుప్పటి పీకుతారు.

276. చన్నీళ్ళ స్నానం చేస్తే చలి అంటారు- వేడినీళ్ళ స్నానంచేస్తే కట్టెలు దొరకడంలేదంటారు- కాలువలో స్నానం చేస్తే కాలుజారి పడతావంటారు- బట్ట కట్టుకుని స్నానంచేస్తే ఒల్లు సరిగా తడవలేదంటారు_ తలకు చమురు వ్రాసుకుని స్నానంచేస్తే తలచముఱు వంటినిండా కారినదంటారు

277. చెముడు చెముడంటారు, వినపడ లేదంటారు. విన్నా వినపడలేదంటారు. వృద్ధులు

278. చలికాలములో ఆకలిబాధ తక్కువ- వేసవి కాలములో ఆకలి దప్పికలు ఎక్కువ- ఎందువల్లనంటే సూర్యుడు తేజోవంతముగా యున్నకొలది జఠరాగ్ని పెరుగు చుండును. అట్లు పెరిగిన జఠరాగ్ని చల్లారుటకుగాను ఆహారములు అవసరము. త్రాగినజలము చమటరూపముగా రోమములద్వారా శరీరములోనుండి బయటకు వెడలును. అందువల్ల గర్భములోని తడి తగ్గి దాహము కలుగును అట్లు కలిగినప్పుడు మనము జలము త్రాగి భర్తీ చేస్తూ యున్నాము. అటులనే సర్వజీవజంతువులు వేసవికాలములో అధికముగా నీళ్లు త్రాగును.

279. నారాయణనామముతో దైవమును స్మరించు చున్నాము- నారాయణ యనగా 'నా' జన్మకు మూల కారకుడైన, 'రాయణ' అనగా పదార్థము అని భావము- ఆ పదార్థమునకు రూపము లేకపోయినను మనోలగ్నత కొరకు

ఒక పురుష ఆకారమును కల్పించి ప్రార్థించుచున్నాము. ఆ నారాయణునికి ముగ్గురు భార్యలని, ఒకరు సరస్వతి, రెండు లక్ష్మి, మూడు అగ్ని యని చెబుతారు. ఈ విధముగా. కల్పింపబడి కవులచే వర్ణనచేయుచూ వేలాది గ్రంథములు అవతరించినవి ఇదియంతయు మనోలగ్నతకొరకు నిర్మింప బడినవే అయినప్పటికీ, మూఢజనులు వాటినే ఆధారముగా చేసుకుని చరిత్రలు, కథలు, నోములు, వ్రతములు ఇత్యాదివి ఉద్భవించినవి- కాని వాటిని విమర్శించుటకంటె దైవమును ఏదో ఒక భావమున గుర్తించు చున్నందుకు ఆనందింపండి.

280. మారణయంత్రములు వేలాదికములు- ఒక దానికంటె మరిఒకటి అధికశక్తితో, అధిక ప్రాణనష్టమును, అధిక ఆవరణలో, అధికవేగములో భస్మము చేయునవి. ఇందువల్ల సంప్రాప్తమగునది ఆనందముకాదు- అసూయ, పగ, ద్వేషము ఇత్యాది గుణములకు ప్రోత్సాహత ఇవ్వబడు చున్నది- మీరే గుణవంతులవుతే ఈ విధానమునకు స్వస్తి చెప్పి ప్రేమభావమునను గౌరవముయిచ్చి ఆచరించి ఆనంద ముగా జీవితకాలము గడుపుతారు.

281. ప్రభువులు వేలాదిమంది పరిపాలించినారు- మరణించినారు- వారిస్థానములను క్రొత్తవారు అలంకరించు చున్నారు- అటులనే ప్రతిగృహములోను ప్రతిస్త్రీ సంతాన వతియై ఆనందించుచూ తన కర్తవ్యము పూర్తికాగానే మరణించు చున్నది. తనబిడ్డలు తిరిగి సంతానవతు లగు చున్నారు- ఈవిధముగా కాలచక్రము తిరుగుచున్నది.

282 వృక్షములు పలుశాఖలతో విస్తరించి పుష్పాలు ఆకులు, కాయలు కాచి పండిన ఆకులను రాల్చుచూ తిరిగి క్రొత్తఆకులను పొందుచున్నవి. పుష్పములు ప్రతిదినము సూర్యోదయకాలమునకు వికసించుచున్నవి- అవి చెట్టుకు అలంకారమును కలుగచేయుచున్నను, కొన్నిజాతులపుష్పములను ప్రజలు త్రుంచి శిరస్సులలోను, దైవవిగ్రహాములవద్దను పెట్టి ఆనందించుచున్నారు. కాయలు పండ్లు సర్వజీవజంతువులేగాక మానవులు అనుభవించుచున్నారు. ఇట్టి వృక్షములకు శక్తిని కలుగచేసిన ఆ మహాశక్తినే ఆదిశక్తి అంటారు- దానినే వివిధనామములతో ఆరాధించుచున్నారు.

283. పలువురు ప్రజలు తమ ప్రదేశములలోని పోషక వస్తువుల అన్యప్రాంతములకు రవాణా చేయుచున్నారు- అది సరియయిన విధానముకాదు- ప్రతిప్రాంతములోను అచ్చటి వాతావరణమునుబట్టి అచ్చటి జీవులకు అనువైన పోషక పదార్థములను దైవము సృష్టించియుండగా రుచులు మరిగి వాటిని నిరసించి అన్యప్రాంత వస్తువులను దిగుమతి చేసుకొని అనుభవించుచున్నారు- అందువల్ల తలవని ఆరోగ్యదోషములు వ్యాధులరూపముగా వృద్ధి చెందుచున్నవి- గనుక దైవప్రేరితముగా ప్రాంతములో ఉద్భవింపబడినపదార్థములనే కృషిచేసి అధికముగా ఉత్పత్తిచేసి అనుభవించుట సక్రమ మార్గము.

284. భూలోకములోయున్న సర్వజీవులకుపోషక వస్తువులు వేరువేరుగా దైవమునిర్మించుటలోఒకవింతయున్నది చిన్న జంతువులను పెద్దజంతువులు భక్షించుచున్నవి. దోమలను

బల్లులు భుజించుచున్నవి- కప్పలను పాములు భుజించుచున్నవి ఇదేవిధముగా పశు పక్షి స్వభావసిద్ధమైన జీవములను దైవము నిర్మించియున్నాడు, కాని మానవుడు తను బలశాలినని అక్రమ మార్గములను అవలంబించి అనేక జీవజంతువులనుచంపి వాటి మాంసమును భుజించుచున్నాడు- ఇందువల్ల రజో తామస గుణములు పెరుగుచున్నవి.

285. దంతములు పెరిగిన మదపుటేనుగులు స్వేచ్ఛముగా అడవులలో తిరుగుచుండ, వాటిని బలత్కారముగా బంధించి మానవులు తెచ్చి వాటి సహాకారముతో అనేక కార్యములు చేయుచున్నారు- పులులను వేటాడి చనిపోగా వాటి చర్మములనుతెచ్చి ఆనందించుచున్నారు. మేకలు, గొర్రెలు అమితముగా సంతతి చేయుచుండగా వాటిని చంపి భుజించుచున్నారు. ఇట్టి లక్షణములుగల మానవుని ఏమని పిలువవలెను.

286. తులసీవనములో సంపెంగచెట్టు వేసినయెడల ఆ సంపెంగపుష్పముయొక్క వాసన తులసికికూడా లభించును గాని పల్లేరుచెట్లమధ్య మొలచిన గడ్డికి ముళ్ళు పుట్టవు.

287. ప్రజాపతి పరిపాలించినప్పుడు పరిపాలన ఒకే మార్గమున నడచును- అట్లుగాక ప్రజాపరిపాలన వచ్చినప్పుడు ఒకనాడు త్రాగుడు నిషేధము, మరిఒకనాడు ఉచితముగా మారుచుండును.

288. అంటరానితనముతో అణగంటిన కులముల వారు నేడు హరిజనులుగా భావింపబడి వారికి ప్రత్యేకసౌకర్య

ములు, అధికారము కల్పింపబడుచున్నవి- ఒకనాడు బానిస లుగా పరిగణింపబడినవారు కూడా స్వతంత్రజీవులై నారు- ఇటులనే ప్రజలలో భావములు మారినప్పుడల్లా వేరు వేరు ధర్మములు ఆచరింపబడును.

289. చిలుకలు పంజరములలోను, దొంగలు ఖైదీల లోను బంధింపబడుచున్నారు- ఆ విధముగా బంధింపబడినవా రందరు ఆత్మస్వరూపులే అయినను వారి జన్మ ప్రారబ్ధమువల్ల లభించిన శిక్ష. అలనాడు రుక్మిణీదేవి శ్రీకృష్ణుని వరించినను ఆమెకు కలిగిన అలంకారములవల్ల శ్రీకృష్ణునిచే అపహరింపబడి బందీగా వెళ్ళి కోరిన భర్తను పొందినది అది ఆనందముతో కూడిన బందిఖానా. ఇవి అట్లుకాదు. ప్రజలు తను ఆనందముకొరకు చిలుకలను బంధించుచున్నారు చిలుక పలుకులు మానినయడల వాటికి ఈదుర్గతిప్రాప్తించెడిదికాదు. ఇకను దొంగలు బంధింపబడినారంటే శ్రీమంతులఎడ వారికి గల ఈర్ష్యాభావమే ముఖ్యకారణము, ఈ ఈర్ష్యకు ముఖ్య కారణము వారి పేదతనము. వారి పేదతనమును శ్రీమంతులు గమనించి ఆదరించిననాడు ఈ దొంగతనములు, దోపిడీలకు తావు వుండదుకదా! ఆ విషయములను గమనించి పరిపా లించినవారు అలనాడు రామచంద్రుడు- అందువల్లనే ఆయన కీర్తి నాటినుండి నేటివరకూ ఆబాలగోపాలము చెప్పు కొనుచున్నారు- అట్టివారు ఎవరైనా తిరిగి లభించేవర్యంతం వారికీర్తి ప్రతిష్ఠలు ప్రతివారు వింటూనేవుంటారు.

290. నారాయణ నామస్మరణ చేయువారందరు దైవ భక్తులు కారు- ఎందువల్లనంటే ఆ నారాయణుడు వారిఆత్మ

లోనే యుంటే అది తెలుసుకోనక నామస్మరణచేయుచూ, గంతులు చిందులు వేయుట వెర్రితనమా? పిచ్చితనమా?

201 పచ్చిపులుసు అంటే చింతపండు పిసికి పిప్పిలు తీసివేసిన పదార్థము- ఆ పదార్థములో స్త్రీలు అనేక వంటకములు చేయుచున్నారు- అయినప్పటికి దేనిరుచి దానిదే.

292. ఒక బీరకాయ ఇగురులో ఉప్పు కారం మాత్రం వేస్తారు- అది వేయకుండా రుచిరాదు. అటులనే ప్రతి మాటలోను ఒక చమత్కారపదము వాడతారు- అప్పుడు శ్రోతలు ఆనందించి ఉబ్బిపోతారు.

293. పెరటిలో పండిన వంకాయకూర, వీధిలో కొన్న దానికంటె ఎంతో రుచిగాను, కమ్మగాను యుండును. అది యునుగాక మా పెరటిలో పెంచినదనే ఆనందంకూడా ఉన్నది కదా. ఈవిధముగానే బజారునుంచి తెచ్చిన మిఠాయిల కంటె ఇల్లాలు వండిన పదార్థములు రుచిగాను హితముగాను యుండును.

294. శృంగారం శృంగారం అంటారు- పచ్చని పసుపు కాళ్ళకు వ్రాసుకుని, తలకు చమురురాసి దువ్వి, ఒంటినిండా బిళ్ళగోచీపెట్టి బట్టకట్టి కండ్లకు కాటుకపెట్టి కుంకుమ బొట్టు పెట్టుకుని ఇల్లాలు సాయంత్రింవేళ వీధిగుమ్మంకడ నిలుచుంటే ఆ ఇంటికి ఎంత శృంగారం- అవి ఈనాడు పోయినవి.

295. నిర్మలమైన హృదయముతో పరస్త్రీలను తల్లులుగా భావించేవారు ఈనాడు కరువైనారు- వారి దృష్టి

ఆమె ధరించిన ఆభరణములవంకే ఉంటుంది- అవకాశము దొరికితే ఆమెను అపహరించవలెననే భావనయేవారికి.

296 జగత్ జనని అంటారు. ఈ జగత్తులో ఆమె కూడా ఒక భాగమేకదా! అట్టితరి ఆమె ఎవరి సంతతి?

297. చలువరాతి విగ్రహములు తెచ్చి మా గురుదేవ మని పూజలుచేస్తారు ఆ విగ్రహములు రాతిలో మిగ్రింగబడి యున్నప్పుడు గమనించినవారు లేరు.

298 పలువురు పెద్దమనుష్యులు ఒక మార్గమున బోవుచూ ఈ గ్రామములో చింతచెట్లు జాస్తీగాయున్నవి- చింతపండు అధికముగా దొరకవచ్చును. కాని ఆచింతపండు సహాయముతో ఎల్లరకు ఉపయోగపడు వృత్తులు చాలా వున్నవి- వాటిని ఈ గ్రామస్తులు ఆదరించుతే వారి గ్రామ దరిద్రం పోతుందన్నారు.

299 తుమ్మజిగురు తుమ్మచెట్లనుండి స్రవించు బంక- అది అనేకవిధముల ఉపయోగపడుచున్నను లెక్కచేయక తుమ్మచెట్లను నరికి వంటచెరుకుక్రింద వాడుచున్నారు.

300 పరోపకారబుద్ధితో సిగడపకు వచ్చిన అభాగ్యు నికి బిచ్చమిచ్చి వాని దరిద్రవిముక్తికి తోడ్పడుము.

301. నెమలి ఈకెలు తెచ్చి కాల్చిన భస్మము ఒక సీసాలో నింపియుంచండి- ఎవరైనా పాము కరచినదంటే ఆ భస్మము తెచ్చి పొగవేయండి- అరగంటసేపులో ఆ విషము హరించి రోగి స్వస్థుడు కాగలడు.

302. దోసకాయకూరలో పప్పు కలుపుకుని తింటే నీ ఆరోగ్యము అభివృద్ధి చెందును.

303 చీకటిరాత్రులలో ఆరబైట పరుండకుము.

304 కాకరపంట చేసు- అందుకుగాను పప్పులో నంచుకుని తినవలెను.

305. అందని చెట్లపండ్లను కోయుటకంటె అందేచెట్ల పళ్ళు ముందు కాపుకు వస్తవి గనుక వాటిని భుజించు.

306. చిలగడదుంపలు ఉడకవేసుకొని తింటే మేహ శాంతి వస్తుంది.

307. హారతికర్పూరం తెల్లగా యున్నది- కాని వెలిగించినప్పుడు అగ్నిజ్వాలలతో వెలుగును- కొలదికాలములో హరించిపోవును- దుర్మార్గుడు మంచిదుస్తులువేసి సత్సంఘములలో తిరిగినను అవకాశము కలిగినప్పుడు వానిలో దాగియున్న దురభ్యాసము అగ్నిజ్వాలలవలె వెలువడును.

308. నవమినాడు ఏ పనిచేసినా కలిసి రాదంటారు- అష్టమి నవములు అంటరాదంటారు- శ్రీరామనవమిరోజున అంతా వేడుకలు జరుపుకుంటారు.

309. చంద్రోదయము కాగానే ఇల్లాలు దీపాలు వెలిగిస్తుంది- దేవాలయములలో పూజారులు భక్తులకోసం ఎదురుచూస్తూయుంటారు.

310. చవిటినేలలో పెట్టిన విత్తనములు మొలవవు. అటులనే మొద్దుఅబ్బాయిలకు పాఠాలురావు.

311 చింతచిగురు ఉడకబెట్టి బెల్లంకలిపి ఉండలుచేసి పసిపిల్లలకు పెడితే వారి రక్తములోయున్న దోషములు పటాపంచలైపోతవి.

312. జామాకు పసరు తెచ్చి కాళ్ళకురుద్దుకొంటే సంజు వ్యాధి నయమవుతుంది.

313. తులసిరసం తీసి దానిలో తేనెకలిపి త్రాగితే పక్షవాతరోగం నయమవుతుంది.

314 గోండాకు పసరు తెచ్చి నడుముకు వ్రాస్తే మూలనున్న నడుమునొప్పి హరిస్తుంది.

315. పచ్చిఆముదములో పసుపుకలిపి తలంటుతే తలవెంట్రుకలు లేనివారికి కలుగుతవి.

316. ఆకలి జాస్తిగా యున్నవారు పరగడపున రెండు దానిమ్మచిగుళ్లు తింటే తగ్గుతుంది.

317. చలువరాతి విగ్రహములతోను; నల్లరాతి విగ్రహములతోను, కంచువిగ్రహములతోను దైవారాధన చేయుచున్నారు- కాని భక్తులు వేలాదిమంది భాద్రపదశుద్ధ చవితిరోజున ఆనందముతో కుమ్మరిచే సృష్టింపబడినవినాయక విగ్రహములను తెచ్చి పూజించి చక్కగా భుజించి పిమ్మట ఆ విగ్రహములను జలమయం చేస్తూ యున్నారు. ఇట్టి విగ్రహము లన్నియు మానవుని ముక్తిమార్గమునకు అంచెలుగా ఉపయోగపడుచున్నవి.

318 వైష్ణవులలో చాలా తెగలు ఉన్నవి. వారందరు చక్రాంకితాలు చేయించుకుంటారు- అట్లా చేయించుకోని

వారి చేతిఅన్నంకూడా తినరు. ఇట్టి అడ్డంకులన్నీ పెట్టుకుని వాటిలో వారు తగాదాలు పెంచుకుంటున్నారు- ఇది మానవ నిర్మితముద్రణ- ఇది దొంగస్వాములవారు నిర్మించినశాసనం— ఈ శాసనం పాటించనివారు ముక్తి పొందరా? ఎక్కడిది విచిత్రం. ఇట్లే అనేక మాయవేషాలతో ప్రజలు మోసపోవుచున్నారు.

319. చిత్రాలు వేలాది నిర్మిస్తున్నారు- వాటిలో చాలావరకూ ప్రాపంచికభోగాలకు సంబంధించినవే. అందువల్ల నేటికాలపు ప్రజలు ఆకర్షింపబడి ఆనటనలను అలవరచుకొనుచున్నారు- ఒక అమ్మాయి రెండుజడలువేసి నటించిందంటే ఆ చిత్రప్రదర్శన మరురోజునుంచి అది వారు ఆచరించుచున్నారు- ఒక నాట్యకర్త రవికమీద పెద్దదిగా సరికినదంటే అందరు అదే పాటిస్తున్నారు. కాని మంచిమార్గములు అలవడుటలేదు- ఇది ఈనాటి కాలమహిమ.

320. బహుదూరమునుండి ప్రయాసపడివచ్చినారంటే బంధుప్రేమఅంటారు- అది నిజంకాదు- బంధువులు శ్రీమంతులు అయితేనే వెళతారుగాని దగ్గరలోయున్న బీదబంధువుల ఇంట్లో అక్కరలను ప్రేమతో ఆహ్వానించినా వెళ్ళరు- దూరపు శ్రీమంతుల ఇండ్లకువెళ్ళి కానుకలుకూడా చదివించి వస్తారు ఇది ధనమహిమ.

321. పరోపకారబుద్ధిగలవారు వారి వద్దయున్న ధనము దానములు చేయుచూ ఆనందించుచున్నారు. శ్రీమంతులు వారికి కలిగినదానిని వారి సంతానము-వారికి కలుగ చేసి

ఆనందించుచున్నారు- అంతేగాని మనుజన్మశుద్ధికి వినియోగించుట లేదు.

322. పసుపుతో కళశమునుచేసి పూజిస్తారు ఇందు ప్రధానము కళశమా? పసుపా?

323. చిన్నచిన్న గుడిశెలు వేసుకొని జీవించేవారికి యున్న ఆనందం మిద్దెలలోవారికి యుండదు.

324. పరోపకారసేవ గమ్యముగా భావించినవారు నేటికాలములో కరువైనారు.

325. చెలికాడు చెలికాడు అంటే తోటి సహవాసి- అలాగే చెలికత్తెలుకూడా యున్నారు- వివాహకాలములో వారు కోరు భర్తనుగురించి చెలికత్తెలద్వారా పెద్దలకు నెరుకపరుస్తారు.

326. నలుగుపెట్టుకు స్నానంచేస్తే వంటికివ్రాసినమానె పోతుంది- పసుపువ్రాసి నలుగుపెట్టుకుంటే శరీరము ఛాయ వస్తుంది. సబ్బువ్రాసి తోమితే చమటకంపు పోతుంది.

327. సంభావనమునకు ఎదురుచూచేవారల్లా ఆశీర్వదిస్తారు- వారి ఆశీర్వచనములు నామమాత్రములే.

328. పలువిధముల దేశప్రజలు ప్రభుత్వ చర్యలను గురించి విమర్శిస్తారు- కాని పరిపాలించేవారి బాధ గుర్తించలేరు.

329. ద్వాదశినాడు బ్రాహ్మణులకు సంభావన

ఇస్తారు- అది చెడ్డరోజని దోషవిముక్తి కాలేక పుణ్యము చేయుటకు మంచిరోజుఅనా ?

330. జీవి జీవించివున్నంతవరకూ బంధువులు మిత్రులు అందరూవస్తారు- జీవి వెడలిపోయినదంటే అబ్బా దుర్వాసన ప్రారంభించినది ఇంకా బాగుచేస్తారేం! దహనవిషయం ఆలోచించండి అంటారు

331. పరుపులు కుట్టేవారు దూదిని పింజలుపింజలుగా ఏకి అందులోని దోషమును పోగొట్టి పరుపులు కుడతారు. ఆలాగే ఆవకాయపచ్చడితో భోజనంచేస్తే కడుపులోని మకిలినంతా పోగొట్టి కడుపు శుద్ధిచేస్తుంది.

332. బుద్ధిలేని కుర్రకుంకలు దోవవెంట నడుస్తూ ప్రక్కనపోవుచున్న జీవజంతువులపై బెడ్డలు వేస్తారు. అవి వాళ్ళను యేమిచేసినవి? అది వాళ్ళస్వభావము.

333. పలువురు పురజనులు వీధివెంట వెళ్ళుచూ ఆ ప్రాంతములో ఆకలిబాధతో అల్లాడుచున్న ఒక యాచకుని చూచి వీడు చాలా బీదవాడు- పూర్వజన్మలో చేసిన పాప ఫలం అనుభవించుచున్నాడని వెళ్ళిపోయినారు- ఒక బాలుడుచూచి పరుగున ఇంటికివెళ్ళి రెండుగుప్పిళ్ళు బియ్యం తెచ్చి ఇచ్చినాడు- ఆబాలుని జాలిగుండెకు ఆనందించి నాయనా నీకు ఒక నమస్కారము అని ఆయాచకుడు వెడలినాడు అంటే పెద్దలకంటె పిన్నలే జాలిహృదయస్థులన్నమాట.

334. చిన్నచిన్న బావులలో కప్పలువుంటవి. వాటిని ఆ బావిలో ఎవరు పడవేసినారు? లేక వాటంతట అవివచ్చి

పడినవాయని విచారిస్తే నీటిని ప్రాప్తింపజేసిన దైవమే ఆనీటి దోషములను సంహరించుటకు కలుగ జేసినాడని తలంచవలెను.

335. సముద్రపు కెరటములు వస్తూయున్నవంటే పిల్లలు ఆనందముగా మునిగి స్నానంచేస్తారు- మొసలి వస్తూయున్న దంటే పరుగెత్తి వడ్డుకువస్తారు

336. నదీప్రాంతములో నివసించేవారు నదీస్నానం చేస్తారు- కాని సముద్రతీరంలో నివసించేవారు ఇంటి బావి వద్దనే చేస్తారు.

337. చీకటిబజారులలో కన్నీత్తిరిగేవారు పోలీసుశాఖకు రెవిన్యూశాఖ గూఢచారులు, దొంగలు, దొంగవస్తువుల కొనుగోలుదారులు- వారిచేతులలో ఆయుధము లుండవు. వారికి పరోపకారబుద్ధి యుండదు- ఎంతసేపూ ధనార్జనయే. అట్లు సంపాదించిన ధనము నావద్ద నిలువదు. ఎందువల్ల నంటే వారి అంతరాత్మ ఎప్పుడూ బాధించుచుండును. ఎవరిని చూచినను తన దోషములు తెలుసుకుని తనను బంధించి శిక్షించుటకు వస్తున్నాడేమోయనెడి భీతి- కాని బయటకు పొక్కకుండా ధైర్యవంతులు నిర్మల హృదయులవలె ప్రవర్తిస్తారు.

338. నలుమూలల వెదకినను కనరాని, కనబడని దైవము సూక్ష్మరూపములో నీశరీరములో దాగియున్నాడు- వాని ప్రభావము గుర్తించినవాడే ఉత్తముడు.

339. చాకలి రేవులో బట్టలు ఉతుకుతుంటే ధ్వని ఆ ప్రాంతమంతయు వినబడును- బాజాలు వాయిస్తేనూ విన

బహుశ. కాని ధ్వనిలోని భేదమునుబట్టి మనము వాటిని ఫలానాయని గుర్తిస్తాము. అలాగుననే ప్రతి మానవునిలోని గొంతుక ధ్వనినిబట్టి మాట్లాడినవారిని చూడకుండానే గుర్తిస్తాము.

340. నువ్వులు గానగలోవేసి చమురుతీస్తారు- పప్పులు రోట్లోవేసి పిండుతారు- ఉలవలు నీటిలోవేసిఉడకపెడతారు ఇన్ని చేస్తారుగాని అల్పబుద్ధివానిని మార్చలేరు.

341. భూమిమీద అనేకజాతులవృక్షములు మొలయు చున్నవి- విత్తనములు ఎవరు వేస్తూయున్నారంటే ఆదైవమే పక్షులరూపములో తెచ్చి వేస్తూయున్నవి.

342. బాటసారి ఎండదెబ్బ తగిలి మూర్ఛిల్లినాడంటే నలుగురు గుమిగూడి ఉపచరణలుచేస్తారు అతను బంధువుడా కాదు- అది మానవధర్మం గనుక. ఇటులనే అనేకసమయము లలో మానవులు తెలియనివారికి సేవచేస్తారు. అట్లుచేయు టయే పరోపకారసేవ అంటారు- ఇది స్వాభావికముగాఅలవడు ఆచారము.

343. తమలపాకులు ఈనెలుతీసి తాంబూలము వేసు కుంటారు- అది నమలడం కష్టమనా? కాదు- ఆకులో జీర్ణ శక్తియున్నది- ఈనెలో అజీర్తిస్వభావమున్నది- అందువల్ల తీస్తారు.

344. నమిలీనమలని అన్నం భుజించేవారి పొట్టలు బరువై గర్భవతులవలె ఉంటారు- చక్కగా నమలి భుజించె వారి పొట్టలు లోతుగాఉంటవి.

345. పురిటిలోయున్న పసిపాపకు తల్లి, తండ్రి ఎవరో తెలియదు- ఎవరిగర్భములోనుంచి జనించినది తెలియదు- ఎవరు తనకు స్తనముల నందించి పాలు త్రాగించుచున్నదీ తెలియదు అటులనే మనలను సృష్టించిన ఆదైవము మనకు తెలియదు- కాని పెద్దలచే చెప్పబడిన హితవాక్యములబట్టి ఆ దైవమును మనము గొలచుచున్నాము. కాని ఆదైవము అగోచరుడై నందున ప్రజలను నకరిహాగ్గములో త్రిప్పుచున్నారు ఆదైవమును మరిపించి ప్రాపంచిక సుఖములతో ముంచుచున్నారు.

346. జైనమతస్థులు భోజనముచేయునప్పుడుదోమలు రాకుండా సాయంత్రమే భోజనముచేస్తారు- కాని వారి అంగళ్ళలో దీపాలు దేదీప్యమానంగా ఉంటవి.

347. భరతుడు రాముని పాదుకల సహాయములో రాజ్యపాలన చేసినాడంటె చెప్పుకోతగ్గవిషయము ఈనాడు మంత్రులసహాయముతో చేస్తూయున్నారు. ఆ మంత్రులు పదవీవ్యామోహాకులు- ప్రజాక్షేమముకంటె వారికి ప్రజలచే జరుపబడు విందులు, వేడుకలు ఇత్యాదివాటితో ఆనందిస్తారు.

348. నాదేశము, నారాజ్యము, నాప్రజలు అంటారు. ఈ "నా" అనే పదమునకు మొదలు చివర కనబడదే! నా శరీరమునుంచి బయలుదేరి అనేక వింతవింతలుగా ప్రజలను మోసపుచ్చుచున్న ఈ "నా" అనే భావము తొలగిననాడు ఆత్మస్వరూపుడు.

349. లేతలేత తమలపాకులు వంద తినవచ్చును కాని

ఎండిపోయిన అరటిఆకు తినలేము- కారణం దైవనిర్మితము. దైవము ప్రతివస్తువును ఒక కారణముగా సృష్టించినాడు. వాటి పరిభావమును తెలుసుకున్నవాడు జ్ఞాని, తెలియనివాడు అజ్ఞాని.

350. తండ్రి తనబిడ్డలను శిక్షించి పోషిస్తారు- గురువు జ్ఞానవంతులుగా చేస్తాడు. భార్య గృహస్థునిచేస్తుంది. పిల్లలు కుటుంబీకునిచేస్తారు. మనుమలు తాతగాచేస్తారు.

351. పొలములో నాటిన విత్తనములు కుళ్ళి మొలకెత్తి చెట్లు అగుచున్నవి- గురువు బోధించిన విషయములు మనస్సులో లీనమై జ్ఞానవంతుని చేయుచున్నవి

352. నీ దేవుడు నా దేవుడు వేరు అంటారు- అది నీరుచూచి దానిని పానీ అంటారు మహమ్మదీయులు. జలమని హిందువులు, వాటరు అని ఆంగ్లేయులు చెప్పుకొనినట్లుగా యున్నది. ఇది మనలోని అసత్తువును తెలియచేయుచున్నది.

353. శిశువునకు తల్లియు, వృక్షమునకు జలమున్నూ, భక్తునకు దైవమున్నూ, దరిద్రునకు దాతయు, ధర్మమునకు శాంతమున్నూ, వీరునకు ధైర్యమున్నూ, రాజునకు సైన్యమున్నూ, భార్యకు భర్తయు, భర్తకు భార్యయు, మానవతికి పాతివ్రత్యమున్నూ, పురుషునికి విద్యయు, వర్తకునకు ధనమున్నూ, లోకమునకు వర్షమున్నూ సహాయపడును.

354. తృప్తి లేనివానికి గంపెడు ధనము నిచ్చుటకంటె తృప్తిగలవానికి గుప్పెడు బియ్యం నిచ్చుటమేలు.

355. దేనియందైనను అభిమానము కలిగియున్నంత వరకూ బంధవిముక్తి పొందలేరు.

356. చిలుకలు బంధింపబడి, కాకములు స్వేచ్ఛగా సంచరించురీతిని గుణవంతులు కష్టపడుటయు, గుణహీనులు సుఖపడుటయు లోకస్వభావము.

357. అనన్యవిశ్వాసముగలదే భార్య, కార్యభారము వహించి తనకు కీర్తి తెచ్చువాడే పుత్రుడు.

358. పదహారువన్నెగల బంగారముకూడా వెలిగారం లేనిదే అతకదు.

359. భక్తితో సమర్పించెడి పుష్పము బరువు లేక పోయినను దానిలో భక్తిభావము బ్రహ్మాండమంత బరువున్నది.

360. గృహస్థు, బాలునికి కుమారైనిచ్చి దైవభావముతో పాదములు కడుగుచున్నాడు.

361. ఓర్పు ఉన్నయెడల కవచము లక్కరలేదు. కోపమున్నయెడల శత్రువు లక్కరలేదు. మిత్రువులుండెనేని సిద్ధౌషధము లక్కరలేదు- దుర్జను లుండెనేని సర్పము లక్కరలేదు.

362. పంగనామములు వైష్ణవులకు గుర్తు, అడ్డబొట్టు శైవులకు గుర్తు, కాషాయవస్త్రములు సన్యాసులకు గుర్తు' చేతిగాజులు ముత్తయిదువకుగుర్తు, బోడితల వెధవస్త్రీలకుగుర్తు చేతికర్రి వృద్ధాప్యమునకు గుర్తు, కండ్లఅద్దములు మసకకు

గుర్తు, చెవుల కుండలములు పండితులకు గుర్తు, తలపాగ ఉద్యోగికి గుర్తు, దవాలి బంట్రోతుకు గుర్తు, చేతిలో పొది మంగలికి గుర్తు, వీపున బట్టలమూట చాకలికి గుర్తు, చాపల తట్ట పల్లివారికి గుర్తు, సేసపలిక దాసికి గుర్తు, పార పలుగు కర్షకునికి గుర్తు, చేతిలో పలక విద్యార్థులకు గుర్తు, చేతిలో బెత్తం గురువుకు గుర్తు.

363. శక్తిని బయటయుటకు ప్రియమనిబంధన విధేయత.

364. శరీరవ్యాయామము భౌతికదేహమునకు అత్యంత ఉత్తమమైన క్రిమశిక్షణ.

365. గృహస్థునికి బంధనము భార్యాబిడ్డలు, సన్యాసికి బంధనము ఆశ్రమము, శిష్యులు.

366. చలిచీమలను చంపుట అతిసులభం పరరాజులను జయించుట అతికష్టం.

367. గోవులను ముద్రించిన చీరెలను కొందరు స్త్రీలు ధరిస్తారు- శ్రీరామరామ యని ముద్రించినబట్టలను కొందరు పురుషులు ధరిస్తారు కాని వారిలో గోవుయందుగాని, శ్రీరామునియందుగాని భక్తిలేస్స- అది వేషఆడంబరమే.

368. చతుర్ముఖబ్రహ్మఅంటే ఆ బ్రహ్మకు నాలుగు వైపులా తలకాయలు, నాల్గు ముక్కులు, ఎనిమిది కండ్లు వున్నవని భావిస్తారు- అది అట్లుకాదు- ఈ భూప్రపంచము లోని సమస్తజీవితపదార్థములు ఆయన ప్రభావమే యని భావించండి.

369. బిడ్డను కనినంతమాత్రముననే తల్లి కాజాలదు- హృదయపూర్వకమైన ఆ మాతృప్రేమయే ఆమెకు ఆ నామము సార్థకము చేయగలదు.

370. నీచేతిక్రింద కొందరు పనిచేయుచున్నప్పుడు నీవు వారికి యజమానివనియు, పోషణకర్తవనియు భావించుట పొరపాటు, నీవు దైవముచే నిర్ణయింపబడిన ఒక ధర్మకర్తవు మాత్రమే.

371. ఛత్రపతి శివాజీ తన రాజ్యమునంతను తన గురువునకే అర్పించి, గురుసేవకుడుగా రాజ్యపాలన చేసెను. అటులనే నీవు ఒక దైవసేవకునిగా భావించి నీ నిత్య కార్యక్రమములను భక్తిశ్రద్ధలతో చేయుదువా నీ కీర్తి ప్రతిష్ఠలు ఆచంద్రతారార్కము వర్ధిల్లగలవు.

372. పశువులు మేతకై పచ్చికబీడులవెంట తిరుగునట్లు నీవు ఆ దైవప్రేమకొరకు, భక్తితో ధర్మకార్యములను ఆచరించుచుండుము.

373. ఆనాడు గోపికలు శ్రీకృష్ణుని ప్రేమించినారంటే మోహబుద్ధితో కాదు- భక్తి ప్రేమభావములతో యని తెలిసికొనుము.

374. చిరంజీవి అని ఆశీర్వదిస్తారు- అనాటివారే చిరంజీవులైవుంటే సృష్టిక్రమం భగ్నమగును కదా! గనుక ఆరోగ్యముతో వర్ధిల్లమని ఆశీర్వదించండి.

375. బిడ్డలను దండింపకుము, అది నీచేతనను కళంకపరచుటయేగాక వారి పవిత్రతను చెరచును.

376. దైవమును యదార్థముగా ప్రేమించదలచువారు ఈ సంఘనియమముల నన్నింటిని దాటిపోవలయును

377. చీపురుపుల్లలు దైవసృష్టి. చీపిరికట్ట మానవసృష్టి నేలను శుభ్రపరచుట చీపిరిపరిభావము- ఇట్లనే సృష్టిలోని ప్రతివస్తువు ఒక నిమిత్తకారణముగా సృష్టింపబడి వాటిధర్మం అవి నెరవేర్చుచూ పిమ్మట భస్మ మగుచున్నవి.

378. సర్వమానవపోషణకు దైవం ధాన్యమును కలుగ చేయుచున్నాడు. అట్టివస్తువులను బీదలకు అందుబాటులో లేకుండా శ్రీమంతులు పురెపోలుకట్టి నిల్వచేస్తూ యున్నారు. నీపొరుగువారి తిండికూడా నీవు ఆలోచించు- అప్పుడు నీవే గాక పరులుకూడా ఆనందముగా జీవయాత్ర చేయవచ్చును.

379. చిగురుటాకులు మెత్తగా యుండును- చిన్న పిల్లల హృదయములు నిర్మలముగా యుండును.

380. దుష్యంతుడు మునికన్యను ప్రేమించినాడంటే అది రాజులకు పరిపాటి. మాలవాడు బ్రాహ్మణ స్త్రీని ప్రేమించినాడంటే అది ధర్మవిరుద్ధము.

381 పురుషులు స్త్రీలు కలసి క్లబ్బులలో చీట్లపేక ఆడుచున్నారంటే వారిలో స్త్రీ పురుష ధర్మములు నశించిన వన్నమాట.

382. తొలిజామున నిదుర పోవుచున్నాడంటే సోమరి పోతు అన్నమాట.

383. అన్న మాట జవ దాటిన తమ్ముడు అయోగ్యుడు.

384. స్త్రీలు పాదములకు పసుపు వ్రాసుకున్నారంటే వారు సాధారణముగా ప్రసవించినప్పుడు సుఖపడుచు దోష విముక్తికి కాని, మరి నీటిలో తిరిగినప్పుడు కాళ్ళు పాచిన బాధ విముక్తికిగాను అనాదికాలము నుంచి ఆచారముగా వచ్చుచున్న హిందూమత ధర్మం.

385 చిరంజీవి అని ఆశీర్వదిస్తారు- కాని ఆశీర్వదించే వారి ఆయుష్షు యెంతవరకూ యున్నదో వారికే తెలియదు- అట్టితరి వీరి ఆశీర్వచనములు ఆడంబరము లేకదా!

386 మేము ఫలానా గోత్రీకులము, ఫలానా ఋషి సంతతివారమని చెబుతారు. అట్టి గోత్రీకుని బిడ్డను ఇతరులకు దత్తత ఇస్తారు- దత్తత యివ్వగానే ఆ గోత్రము, ఋషినామము అట్టే మారిపోయి వేరే గోత్రం, ఋషిపేరు చెప్పుకుంటారు. ఇది లోక ఆచారం- ఇంతమాత్రముతో మారిపోయే వంశ వృక్షమునకు విలువ ఎంత?

387. ఒక ఫకీరు నీ ఇంటికివచ్చి బిచ్చమడుగుతే మీ సాహేబుల ఇండ్లకు వెళ్ళక మా ఇండ్లకు వస్తావేమి అని అడుగుతారు- బిచ్చగానికి కడుపునిండడం ప్రధానము గాని ఈ మత ప్రశ్నలతో సంబంధము లేదునాయనా!

388. అవిటివాడు బిచ్చానికివస్తే నీవాళ్ళంతా ఏమైనారు నీవు ఇలా వచ్చావు అంటారు- బలిష్టుడువస్తే ఏదైనా పనిచేసుకుని బ్రతుకలేవా దున్నపోతులాగ ఉన్నావుఅంటారు, వాళ్ళకుఉన్న బాధలన్నియు నీవు తెలుసుకుని విముక్తి చేయలేవుగదా? ఈప్రశ్న వేయుట ధర్మమేనా?

389. సర్వ జీవరాసులు ప్రతిదినము ఆహారమును భుజించుచున్నవి- వాటికి అనువైన ఆహారపదార్థములు వాటి ప్రాంతములలోనే దొరకుచున్నవి. వాటి సహాయముతో అవి జీవించుచున్నవి ఇది అంతయు ఆసృష్టికర్త ప్రభావమే గదా! అట్టి సృష్టికర్త రూపరహితుడు ఆయన ప్రతి జీవిలోను ఆత్మస్వరూపములో ఉన్నాడని పెద్దలవాక్యం. గనుక అట్లు సృష్టింపబడినవారిలో ఒక బిచ్చగాడుగాని పరదేశవాసి, గాని నీ గడపకు వచ్చినాడంటే ఆదైవమే ఆ రూపములో వచ్చినట్లుభావించి గౌరవించి పంపించినట్లుఅయితే దైవము ఆనందించి నీకు కావలసిన సకల ఐశ్వర్యభోగములను కలుగ చేయును. అందుకు వ్యతిరిక్తముగా ప్రవర్తించినవారు ఈ జన్మలోగాని ఉత్తరజన్మలలోగాని ఆకలిబాధలతో బాధ పడవచ్చును గనుక ధర్మబుద్ధితో పరోపకారసేవ చేయుము. ఇది నీ భవిష్యత్‌కు నాందిగా భావించు అంతేగాని తృణీకార భావముతో ప్రవర్తించి భవిష్యత్‌లో బాధలకు గురి కాకుము.

390. భారతములో 18 అధ్యాయములు ఉన్నవి ప్రతి అధ్యాయములోను కొన్ని ముఖ్యవిషయములు వున్నవి. వాటి ప్రభావమే భారతమునకు గౌరవము ఖ్యాతి తెచ్చినవి- అట్లే ప్రతి మానవునిలోను కొన్ని సుగుణములు యుండును. ఆ సుగుణములను వృద్ధిచేసుకొనుచూ జీవయాత్రచేయువారు ఆనందముగా జీవించగలరు- అట్లుగాక దుష్ట గుణములకు మెరుగుపెట్టి ప్రవర్తించువారు బురదగుంటలోపడిన శునకము చందముగా యుండును.

391. నేను ఒక మహాయోగినని ప్రతివారు నన్ను గౌరవించి పూజించవలెనని భావించువారుకూడా అతిథి సత్కారము చేయుదురు- అట్టితరి సామాన్య మానవులు ఆచరించకుండుట అజ్ఞానముగదా!

392 చాలాకాలమునాటి మిత్రుడు వచ్చినాడంటే ఆనందించి కాళ్ళు కడుక్కోమని నీళ్ళుఅందించి ఇంటివాళ్ళను భోజనము పెట్టమంటావు- ఆలాగుననే ఇంటికివచ్చిన మార్గస్థులనుకూడా గౌరవించు- ఇది హిందూమతధర్మం-అంతేగాని పూలకూటిబసకుతోలకు, కుటుంబమర్యాద నిలబెట్టు. వంశ పారంపర్యా చెప్పుకుంటారు.

393. శూద్రులు, శూద్రులు అంటారు- శూద్రులని ఒక కులంలేదు- శూద్రులు అనగా ఆత్మశుద్ధి లేనివారని భావించండి- వాల్మీకి బోయవాడు శూద్రుడు, కాలగతిని జ్ఞానవంతుడై, పెద్ద వేదాంతియైనాడు. బ్రహ్మతేజస్సుతో వర్థిల్లి బ్రాహ్మణుడుగా వర్థిల్లినాడు. గనుక మనిషిలోని శూద్రత్వమును జ్ఞానబుద్ధితో పారద్రోల వచ్చును. కాని మేము శూద్రులము అంటరానివారమని భావించుట అవివేకము. ఈనాడు అట్టివారిలో కొందరు ధర్మదాతలు, ఆధ్యాత్మపరులుకూడా యున్నారు- రూపురేఖలు లేని ఒక రాతిముక్కను సానబెట్టి చక్కని ఆకారమును, కాంతినికలుగ చేసిన వజ్రముగా బజారుకు తీసుకువెళితే వేలధనం వస్తుంది- ఆలాగుననే ఆ శూద్రులకు ఆధ్యాత్మికభావములు కలుగచేసిన నాడు వారే గొప్ప పండితులు జ్ఞానవంతులు కాగలరు.

394. త్రిలోకనాథుడు అనగా దేవలోకము, మానవ లోకము, నాగలోకము అనే మూడు లోకములకు అధిపతి యని భావన. ఆయన ఏ లోకంలో ఏ రూపంలో ఉండి పరిపాలించుచున్నాడంటే ఆయనలేని స్థలంలేదు- గాలిలోను, నీటిలోను, అగ్నిలోను, ఆకాశములోను, భూమిలోనే గాక సర్వజీవ జంతువులలోను ఉన్నాడు. ఆయన లేనిచోటు లేదట- ఆయన లేనిదే వాయువు ప్రసరించదట- నీరు ప్రవహించదట అగ్ని వేడిని ఉత్పత్తిచేయదట- సూర్యచంద్రాదులు నక్షత్రములు వెలుగొందవట- అట్టివానిని తెలుసుకొనక పోలేరమ్మ, నాంచారమ్మ, ఊరాటలమ్మ అని జాతరలు చేయుచూ, జీవ హింస చేసి మొక్కుబడులు చెల్లించి వాటిని వండుకుని తినుచున్నారు ఇది ఎంతవరకూ సహించతగినవిషయము.

395. గొల్లవాడు పాలు తేలేదంటే దూడ తాగేసిన దంటాడు- చాకలి బట్టలు తేలేదంటే రేవులో నీళ్ళు లేవంటుంది. పిల్లవాడిని బడికి ఆలస్యంగా వచ్చావంటే అమ్మ అన్నం వండటం ఆలశ్యమైనది అంటాడు- పంట తక్కువ వచ్చినదంటే సకాలంలో వర్షాలు లేవంటాడు- పిల్లవానిని పాఠం వప్పగించమంటే రాత్రి దీపాలు వెలగలేదంటాడు- టపా బాటో్రతును ఆలశ్యంగా వచ్చావంటే ఈ రోజు టపా బండి ఆలశ్యంగావచ్చినదంటాడు- ప్లీడరుగారిని మావ్యాజ్యం ఎందుకు పోయినదంటే మీసాక్షులు సరిగా చెప్పలేదంటాడు- వంట అయినదా అంటే అమ్మ బైటవున్నది, వంట చేయలేదని అంటుంది పాపాయి.

396. పల్లెవాడలో కాపురంచేస్తూ అబ్బా చాపలకింపు అంటే ఏమిప్రయోజనము.

397. తొలిజామున లేస్తే నిదురభంగం అంటారు- రాత్రి 12 గంటలవరకూ తిరిగి ఇంటికివచ్చి ఇల్లాలును నిదుర లేపుతే అబ్బా అర్ధరాత్రి వచ్చారే! నాకు కునిపాట్లు వస్తూయున్నవంటుంది- పసిపాప పాలకు ఏడిస్తే రొమ్ము అందించి నిదురపోతారు. ఇట్లాగే సోమరిపోతుతనం పెంచుకుంటారు కాని వారివారి ధర్మములను గుర్తించరు.

398. సూర్యుడు పడమట దిక్కున ఉన్నాడంటే సాయంత్రం అన్నమాట- పశువులు తిరిగి ఇండ్లకువస్తూవున్నవంటే వాటి దూడలు దూరము నుండి పసికట్టి అంబా అని అరుస్తవి. తల్లులు దవ్వునవచ్చి దూడశరీరంనాకి తన ప్రేమ స్వభావము ప్రకటిస్తవి. ఇట్లాగే ఉయ్యాలలోబిడ్డ ఏడుస్తూవుంటే తల్లి పరుగుననవచ్చి పాలు ఇస్తుంది.

399 నాగుపామును పాములవాడు తెచ్చిఆడిస్తూవుంటే పిల్లలు ఆనందపడతారు- అదేపామునుబుసకొట్టితే పారిపోతారు.

400. నాల్గువీధులమధ్యనున్న స్థలములో ఒకలాంతరు దీపం సాతి రాత్రిళ్ళు వెలిగిస్తారు- అట్లనే ఇంటిలో నాల్గు గదులకు మధ్యనున్న చావడిలో దీపంపెడతారు- ఆ వెలుతురు ఇంటిఅంతకు ప్రకాశించును.

401. పరదేశములలోకూడా కొందరు హిందూదేశ వాసులు నివసించుచున్నప్పటికి, వారి ఆచారములు, వేష భాషలు కొన్ని మారినప్పటికి వారిలో మేము హిందువులము అనే భావము దేశాభిమానము నశించదు.

402 గంగసింధూరము బొట్టు పెట్టుకొనినంత మాత్రమున ఆంజనేయోపాసకుడు కానేరడు- గంగిరెద్దుకు బొంత తీస్తే మామూలు ఎద్దే, అట్లే ఈబొట్టు వేషఆడంబరమే.

403. చెవిటివానితో మాట్లాడటం అంటే డోలు వాయించినంత ధ్వని చేయడమే, అందువల్ల చెప్పేది పలక మీద వ్రాసిచూపిస్తే మెరుగు.

404. పగలు సూర్యరశ్మి ప్రభావమువల్ల సర్వజీవజంతువులు ఆహార పోషక వస్తువులను సేకరించుచూ రాత్రి చంద్రకాంతిప్రభావమువల్ల చల్లనిగాలిని అనుభవించుచూ విశ్రాంతిని నిదురరూపములో పొందుచున్నారంటే మనుజునకు శక్తి, పోషకపదార్థములను శరీరమునకు కలుగ చేయుచున్నారన్న మాట- ఆ విషయమును మరచి రాత్రిళ్ళు నిదుర మేలుకొని ప్రవర్తించువారి అందరికి ముఖ్యముగా ఆరోగ్యభంగము తటస్థించుటకు ముఖ్యదోషకారణమని గమనించవలెను- అందుకుగాను పగటినిదుర పోవుచున్నారు-అది సక్రమవిధానముకాదు,

405. పరమభాగవతులమని చెప్పుకొనెడివారు పరమ చాంధసులన్నమాట-- ఎందువల్లనంటే ప్రపంచములో జన్మించిన ప్రతిమానవుడు ఏదో ఒక సమయమున తనను సృష్టించిన దైవమును ఏదో ఒక విధమున ఆరాధించుచుండ మేమేభాగవతులమని చెప్పుకొని విర్రవీగుట ఆడంబరము కాదా! ఇట్టి ఆడంబరజీవులు వీధులవెంట డప్పువాయించుకొనుచూ మేమే పరమభాగవతులము అంటారు. ఇట్టివారుకూడా ఒకనాడు మాయావస్తువుల వలలోపడి మోసపోవుచున్నారు. ఇది ఒక మాయావేషమని చెప్పవలసివుంటుంది.

406. పురిటిమంచంలోయున్న ఇల్లాలు తను మోసి కనిన బిడ్డకు ఆనందముగా పాలుఇచ్చును. ఆ బిడ్డ ఉచ్చ పోసినా విరోచనముచేసినా అసహించుకోనక శుభ్రపరచును. ఇట్టిసేవ ఇతర శిశువులకు చేయదు. కారణం నాబిడ్డ అనే భావమే. ఈ "నా" పదముయొక్క విశేషము అనేక దర్యలకు మూలవస్తు వగుచున్నది ఈ 'నా' పదము తలవనివారు సర్వసంగపరిత్యాగులు.

407 తొలికాన్పు రాగానే బంధువులు ఆనందముతో అనేక భోజన పదార్థములను ఆతల్లికి ఇస్తారు. కారణం గర్భములోయున్న శిశువుకు తగు బలము సమకూర్చుటకే గాని, రుచులకొరకు కాదు. కాని ఈనాడు ఆ విధానము ఒక వేడుకగామారి పంపించిన పదార్థములన్ని బంధువర్గమునకు అందచేసి తమబిడ్డ గర్భవతియని తెలియచెప్పు చున్నారు. ఇది వారికి ఆనందం- మధ్యరకపు కుటుంబీకులకు ఒక ధన వ్యయ శిక్ష.

408. ఆచార్లగారు మంచము మీదనుంచి లేవగానే ఒక ఆవలింతతీసి ఆ పంగనామములు ధరించిన వైష్ణవ స్వాములవారి పటమునకు నమస్కరిస్తారు. అడ్డబొట్టువారు ఓం నమశ్శివాయ అంటారు. లింగధారులు వారి లింగం కళ్ళకు అద్దుకుంటారు. వర్తకుడు తక్కెడ త్రాసుకు నమస్కారము పెడతాడు. పల్లెవాడు వలలు ఎలుకలు కొరికిన వేమోయని కలియచూస్తాడు. బాలురు పలక పుస్తకము లు తీసుకుని చదువుకుంటారు. అమ్మ హాయ్యిరాజేసి వంటచేస్తుంది.

409. ప్రాపంచకములోని సర్వఆధ్యాత్మిక గ్రంథములలోను వేదములు ఉత్తమమైనవి ఆవేదములు సర్వమానవులు ఆచరించవలసిన ధర్మములను ప్రకటించుచున్నవి. అట్టిధర్మములనే నాటికాలపు మహాఋషులు ఉపనిషత్తులరూపములో ప్రజలకు బోధించినారు. అట్టి ధర్మములను పునహ మహాభారతము లోని యుద్ధకాండలో కృష్ణార్జున సంవాదరూపముగా పరిబోధింపబడినవి. ముఖ్యముగా వాటిలోని విషయ మేమనగా— ప్రతిఫలాపేక్షరహితుడవై నీవృత్తి ధర్మములను పాటించుము. ఈ జగత్ సృష్టికర్త అయిన ఆ పరమాత్మ సర్వ జీవరాసుల లోనుఅదృశ్యరూపములో వుండియున్నాడు. ఆయన లేని చోటుగాని, వస్తువుగాని లేదు. నీలో ఆత్మస్వరూపములో యుండి నీవు ఆచరించు సర్వకర్మలను గమనించుచున్నాడు. నీదృష్టికి గోచరించు సర్వవస్తువులేగాక నీ శరీరముకూడా అశాశ్వతవస్తువులు, కాని ఆత్మ శాశ్వతవస్తువై రూప రహితమై సర్వత్రీ వ్యాపించియున్నది అని బోధించు చున్నది. దానిని తెలుసుకొని ప్రవర్తించినవారు జ్ఞానవంతులు, యోగులు సత్ పురుషులు పునర్జన్మరహితులు కాగలరు

410. రామాయణమంటే దశరథమహారాజుకుమార్డు శ్రీరామ చంద్రుని జననమునుంచి ఆయన అనుభవించిన కష్టములు, ఆయన పరిపాలనాకాలములోని ధర్మ ప్రవర్తనలు, ప్రజల యందు ఆయనకు, ఆయనయందు ప్రజలకుగల అభిమానము, ప్రేమ ఇత్యాది గుణములను ప్రకటించుటయేగాక ఆయన భార్య జనకమహారాజు కుమార్తె సీతాదేవి భర్తవెంట అడవులకువెళ్ళి అనుభవించినకష్టములను ఆదర్శప్రాయముగా గ్రంథరూపముగా ప్రచురింపబడిన ఒకపుణ్యగ్రంథము. ప్రజలు

నాటినుండి నేటివరకూ పారాయణ చేసుకొను చున్నారు. మరిన్ని శ్రీరాముడు జన్మించిన చైత్ర శుద్ధ నవమిరోజున శ్రీరామకళ్యాణము వారివారి శక్త్యానుసారముగ ఆరాధించు చున్నారు.

411. శ్రీ ఋషి రాంరాంగారంటే అశోకచక్రవర్తి పరిపాలనా కాలములో ఆయనవద్ద ఆస్థాన వైద్యులు పిమ్మట బౌద్ధ సన్యాసిగా జీవితమును గడిపి ముక్తినొందినారు. కాని దైవ ప్రేరితమువల్ల గత 50 సంవత్సరములుగా అదృశ్యరూప ములో సంచారముచేయుచూ శిష్యకోటికి ఆటోరైటింగు విధానము లో అనగా కలముపట్టి కాగితముపై మోపిన మీరు కోరిన విషయములకు మీచేతిలోని కలమును మీకు తెలియ కుండానే నడిపించి మీకు అవసరసలహాలు, సమాధానములు కలుగచేయుచున్నారు. స్వర్గాశ్రమవాసులు, నిర్మలానందస్వామి వీరి ముఖ్యశిష్యులు గత 12 సంవత్సరములుగా వీరిపరంగా లభించిన విషయములను గ్రంథముల రూపముగా ముద్రించి ప్రచురించుచున్నారు. ఇదిస్వర్గాశ్రవాసులకార్యక్రమం.

412. బహు నిర్మల హృదయులు వృత్తి వ్యాపారమును విసర్జించి ఆశ్రమవాసులుగా జీవిత శేషమును గడుపుచున్న నిర్మలానందస్వామివారు నేటికి 76 సంవత్సరముల వయస్సు కలిగినను ఓపికతోను, శ్రద్ధతోను దేశహితమును గోరి ప్రచు రించిన ఈ నిర్మలానందసూక్తులు చదివి ఆనందించిన బహు జనులకు దైవము ఆయురారోగ్య ఐశ్వర్య సంపదలను కలుగ చేయ ఆశీర్వదించుచున్న పరలోకవాసి

—ఋషి రాం రాం

## ఈ గ్రంథ ముద్రణకు తోడ్పడినవారు

1. వలమలశెట్టి వెంకటేశ్వరరావుగారు చిలకలపూడి
2. లింగమల్లు రఘునాధరావుగారు గుంటూరు
3. పాదర్తి మాణిక్యాలరావుగారు గుంటూరు

---




విలాసం .– స్వర్గాశ్రమము - 20/164 చిలకలపూడి
P. N 521002
కృష్ణాజిల్లా ఆంధ్రప్రదేశ్

## దేవమానవ బోధలు

ఏనాడో చనిపోయిన 125 మంది పరలోకవాసులు, మునీశ్వరులు, యోగులు, దైవభక్తులు, మతప్రబోధకులు, పండితులు, కవులు, ప్రభువులు, పరిపాలకులు, రాజకీయ వేత్తలు,పతివ్రతలు,సంఘసంస్కర్తలు ఇత్యాదివారు ఈనాడు ఆటోరైటింగు విధానమున సంధానకర్తపరంగా ఇచ్చిన సందేశములు.

వెల : రు. 8—00 పోస్టేజి అదనం

N. B. వలయువారు పైకం పంపించి తెప్పించుకొనవలెను, వి. పి. గా పంపబడవు.

విలాసం - స్వర్గాశ్రమము — చిలకలపూడి 521002
కృష్ణాజిల్లా - ఆంధ్రప్రదేశ్

---

## గృహవైద్య ప్రకరణములు

పరలోకవాసులు ఆటోరైటింగు విధానమున సంధానకర్తపరంగా బోధించిన వైద్యవిధానములు. ద్వితీయముద్రణ కొలది ప్రతులుమాత్రమే యున్నవి.

వెల రు. 2—00 పోస్టేజి అదనం

N. B. వలయువారు పైకం పంపించి తెప్పించుకొని వలెను వి. పి. గా పంపబడవు.

విలాసం :- స్వర్గాశ్రమము — చిలకలపూడి 521002
కృష్ణాజిల్లా ఆంధ్రప్రదేశ్

## ఆత్మ అనగా ఏమిటి?

పరలోకవాసులు : 1. విక్రమార్కులవారు

2. బలిచక్రవర్తి

3. అగస్త్యులవారు

ఆటోరైటింగువిధానమున సంధానకర్తపరంగా

బోధించిన విషయములు

వెల· రు. 2–00 పోస్టేజి అదనం

విలాసం - స్వర్గాశ్రమము – చిలకలపూడి 521002

కృష్ణాజిల్లా - ఆంధ్రప్రదేశ్

---

## జీవియొక్క కార్యక్రమము – కర్మవిధానము

సందేశకర్తలు

పరలోకవాసులు అంజలీదేవి, స్వామి తీర్థానంద

వెల· రు. 1–00 పోస్టేజి అదనము

విలాసం :- స్వర్గాశ్రమము – చిలకలపూడి 521002

కృష్ణాజిల్లా - ఆంధ్రప్రదేశ్

| | |
|---|---|
| మహావీరునిబోధలు | వెల రు. 0–50 |
| జీసస్ బోధలు | వెల రు. 0–50 |
| మహమ్మదు బోధలు | వెల రు. 0–50 |
| కులమతద్వేషనిర్మూలనాశ్రమము | వెల రు 0–50 |

పోస్టేజి అదనం

N B. వలయువారు పైకం పంపించి తెప్పించుకోవలెను. వి. పి. గా పంపబడవు.


విలాసం.- స్వర్గాశ్రమము రామానుజపురం
జిల్లాపరిషత్ ఆఫీసు వెనుకవీధి
20/164 చిలకలపూడి 521002
కృష్ణాజిల్లా – ఆంధ్రప్రదేశ్


స్వర్గాశ్రమమునకు రాదలచినవారు మచిలీపట్నంనుంచి పెడన వెళ్ళే సిటీబస్సులో ఎక్కి కృష్ణాజిల్లా పరిషత్ ఆఫీసు వద్ద దిగవలెను.

ఆశ్రమము. పరిషత్ ఆఫీసు వెనుకవీధిలో అనగా కొబ్బరితోట అనే రామానుజపురంలో గుప్తాగారి ఇంటిఎదుట నున్నది. ప్రతిరోజు ఉదయం గం. 7-00 నుంచి సాయంత్రం గం. 5-00 ల వరకు వర్షము లేనిసమయమున వచ్చి కలువవచ్చును.

ఇట్లు

**నిర్మలానందస్వామి**

స్వర్గాశ్రమవాసి

# మా వద్ద దొరకు గ్రంథములు

| విషయము | వెల | పోస్టేజి |
|---|---|---|
| 1. దేహ మానసబాధలు తగ్గింపువెల | 3-00 | 0-40 |
| 2. గృహవైద్యప్రకరణ | 2-00 | 0-20 |
| 3. మహాత్ముల సుభాషితములు | 2-00 | 0-20 |
| 4. చనిపోయినవారి బాధలు | 2-00 | 0-20 |
| 5. ఆత్మ అనగా ఏమిటి ? | 2-00 | 0-20 |
| 6. జీవన్ముక్తి కార్యక్రమము | 1-00 | 0-10 |
| 7. మహావీరుని బోధలు | 0-50 | 0-10 |
| 8. జీసస్ బోధలు | 0-50 | 0-10 |
| 9. మహమ్మదు బోధలు | 0-50 | 0-10 |
| 10. కులమతద్వేష నిర్మూలనాక్రమము | 0-50 | 0-10 |
| 11. నిర్మలానంద సూక్తులు | 2-00 | 0 20 |
| రిజిస్ట్రు డెలివరీ పోస్టుచార్జి | | 0-60 |

ఇట్లు
నిర్మలానందస్వామి
స్వర్గాశ్రమము
చిలకలపూడి
P. No 521002

అక్టోబరు
1976

శ్రీ శాంతి ప్రెస్, ఫోర్టురోడ్డు - మచిలీపట్నం